# విజేతలకు చందమామ అభినందనలు

## మహోన్నత భారతీయ సంస్కృతి పోటీ

**1**



















లేబూరు లావణ్య
D/O ఎల్. సుబ్బయ్య,
టెలిగ్రాఫిస్టు, టెలిగ్రాఫ్ ఆఫీసు,
నెల్లూరు-3 (A.P.)

**I Prize**

కె. జె. యస్. గిరిజాసుందరి
C/O శ్రీ కె. గౌరీశంకర్,
లెక్చరర్, లాయర్‌పేట,
ఒంగోలు, ప్రకాశంజిల్లా

**II Prize**

ఎస్. ముస్తాఖ్ అలీ
19-26, వివేకానంద నగర్,
దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాదు-500 660 (A.P.)

**III Prize**

Parry's

# Fun & Games

## మిఠాయిల మహారాజు పిల్లలని పిలుస్తున్నాడు!

## మిఠాయిల మహారాజు క్విజ్

మీరు 14 సంవత్సరాలు లేక అంతకన్నా తక్కువ వయసుగల వారయితే, యిదుగో మీరు వినోదించడానికి మరియు బహుమతులు నెగ్గడానికి అవకాశం. ఒక ప్యారీస్ మిఠాయి నోటిలో వేసుకొని భారతదేశపు పక్షులు మరియు మృగాలకి సంబంధించిన ఆరు ప్రశ్నలకి సమాధానాలు రాయండి. చుక్కలు వున్న గీత పొడవునా కత్తిరించి కూపన్ ఈ క్రింది చిరునామాకి పోస్ట్ చేయండి.

Parry's King Quiz
P.B. No. 1404, Madras 600 105

శుభ్రంగానూ, స్పష్టంగానూ, శ్రద్ధ తీసుకుని తప్పులు లేకుండా రాయండి. గుర్తుంచుకోండి నెగ్గడానికి ఎన్నో బహుమతులు వున్నాయి. ఈ ప్రవేశ పత్రం మీరు వుపయోగించుకోలేకపోతే, ఈ ప్రశ్నలు అలాగే రాసుకుని ఒక తెల్లకాగితంమీద వాటికి సమాధానాలు శుభ్రంగా రాయండి. ఆ తర్వాత మీ పేరు, చిరునామా, వయసు రాసి పై చిరునామాకి పోస్ట్ చేయండి.

ఒక 1వ బహుమతి
రూ 250 విలువగల కానుక చెక్కు!
రెండు 2వ బహుమతులు
రూ. 150 విలువగల కానుక చెక్కులు!
మూడు 3వ బహుమతులు
రూ. 50 విలువగల కానుక చెక్కులు!
100 కన్సొలేషన్ బహుమతులు
ప్యారీస్‌వారి ఆశ్చర్యం కలిగించే
కానుక ప్యాకెట్లు!
అన్నీ సరైన సమాధానాలుగల
ఎంట్రీల నుంచి ఒక కంప్యూటర్
"రాన్‌డమ్ సెలక్షన్" ద్వారా
బహుమతులు నెగ్గినవారిని నిర్ణయిస్తుంది.





**త్వరపడండి, మీ ఎంట్రీ మహారాజుకి మార్చి 15, 1988 లోపున చేరాలి.**

ప. భారతదేశపు జాతీయ పక్షి ఏది?

: ..................................

: పశ్చిమబెంగాల్‌లోని సుందర వనములు ఏ మృగానికి ప్రసిద్ధి చెందాయి?

: ..................................

ప్ర: సామాన్య లంగూర్ అనేకోతికి రామాయణంలోని ఒక ప్రసిద్ధ పాత్ర పేరు పెట్టారు. ఆ పాత్ర ఏమిటి?

జ: ..................................

ప్ర. దక్షిణ భారతదేశంలోని ఏ రాష్ట్రంలో బందిపూర్ పులుల సంరక్షణ కేంద్రం వుంది?

జ: ..................................

ప్ర: "రణ్ ఆఫ్ కచ్" ఒక వన్య మృగానికి ప్రసిద్ధి చెందింది. అదేమిటి?

జ: ..................................

ప్ర: ఈ క్రింద నాలుగు వన్యమృగ సంరక్షణ కేంద్రాల పేర్లు వున్నాయి. దేనికి ఏది ప్రసిద్ధి చెందిందో చెప్పండి

జ. గిర్: ..................................

కజిరంగా:

నాగార్జునసాగర్:

భరత్‌పూర్:

పేరు ..................................

చిరునామా ..................................

..................................

..................................

పిన్‌కోడ్ ..................................

పుట్టిన తేదీ .................. వయసు ..........

కవలలని కనిపెట్టండి




ఏ రెండు కుక్కపిల్లలు ఒకలాగా వున్నాయి?

జవాబు: B మరియు E

జనవరి కింగ్ క్విజ్ విజేతలనని కలుసుకోండి

1వ బహుమతి: ప్రమోద్‌కుమార్ దీక్షిత్, బొంబాయి

2వ బహుమతి: 1. ఆదిత్య అవసరాల, విశాఖపట్టణం
2. ఎం. శరత్, కర్నూల్

3వ బహుమతి: 1. సి.ఎచ్.రామ్, మద్రాసు 600 020
2. జి.ఎచ్. కుల్‌కర్ని, ధార్‌వార్
3. మాస్టర్ శ్రీహరి, న్యూఢిల్లీ–110 017

ఇవిగో విజయవంతమైన జవాబులు:

దీపాల పండుగ: దీపావళి గణేష్ చతుర్థిని వైభవంగా జరిపే రాష్ట్రం: మహారాష్ట్ర

రంగుల పండుగ: హోలీ

దుర్గాపూజ ఘనంగా జరిపే రాష్ట్రం: పశ్చిమ బెంగాల్

దసారాకి ప్రసిద్ధిచెందిన కర్ణాటకలోని నగరం: మైసూరు

పంటల పండుగలు, అవి జరిగేరాష్ట్రాలు: ఓనమ్–కేరళ, బైసాక్-పంజాబ్, పొంగల్-తమిళనాడు, బిహూ–అస్సామ్

గమనిక: మిఠాయిల మహారాజు మీ గురించి తెలుసుకోవాలనుకుంటున్నాడు. మరచిపోకుండా రాయండి.



# చందమామ

మార్చి 1988



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-50

సంవత్సర చందా: 30-00

ACHANDAMAMA PUBLICATION

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["వినీలుడికథ"]కు ఆధారం, లక్ష్మిగాయత్రి రచన. మనుషులందరి ప్రవర్తన, ఒకే రకంగా వుండదు. అందుకు కారణం, వాళ్ళు పుట్టి పెరిగిన వాతావరణం, సంస్కారం భిన్నంగా వుండడం. వీటికితోడు ఒక్కొక్కసారి మితిమీరిన స్వార్థచింతన, వాళ్ళను అడ్డదారులు పట్టిస్తుంది. ఆశాభంగం చెంది, చింతకు గురవుతారు. "స్వయంకృతం" అన్నకథ యిందుకు మంచి ఉదాహరణ.

## అమరవాణి

ఆరంభగుర్వీ క్షయిణీ క్రమేణ, లఘ్వీపురా వృద్ధిమతీ చ పశ్చాత్,
దినస్య పూర్వార్ధపరార్ధభిన్నా, ఛాయేవమైత్రీ ఖలసజ్జనానామ్.

[ఉదయంపూట నీడలా దుర్జనుల మధ్య స్నేహం మొదట గొప్పగా ఉండి క్రమేణా క్షీణిస్తుంది. సజ్జనుల మధ్య స్నేహం మధ్యాహ్నం తరవాతినీడలాచిన్నదిగా ప్రారంభమై క్రమేణావృద్ధిచెందుతుంది.]

సంపుటి 82 మార్చి '88 సంచిక 3

విడి ప్రతి : 2-50 : : సంవత్సర చందా : 30-00

CHITRA

## చందమామ కబుర్లు



### బ్రహ్మాండమైన మంచుదిబ్బ

40 కి. మీ. వెడల్పూ, 158 కి. మీ. పొడవూ గల బ్రహ్మాండమైన మంచుదిబ్బ, అంటార్కిటికా మంచుఖండంనుంచి విడిపోయి, రాస్‌సముద్రంలో తేలుతున్నది. ఇది ఎంత పెద్దదంటే—దీనిని ఎలాగైనా లాస్ ఏంజెల్స్‌కు చేర్చినట్టయితే రాబోయే 675 సంవత్సరాలకు లాస్ ఏంజెల్స్ నీటి అవసరం దీనితో సరిపోగలదట।

### ఒంటరిగా సముద్ర ప్రయాణం!

న్యూ జెర్సీకి చెందిన టానియా యేబి అనే 21 సంవత్సరాల యువతి, రెండేళ్ళ క్రితం తన తండ్రి ఇచ్చిన చిన్న పడవలో ఒంటరిగా సముద్రప్రయాణం మొదలెట్టింది. బెర్మూడా, పనామా, ఆస్ట్రేలియా, శ్రీలంక మొదలైన ప్రాంతాల ఓడరేవులను సందర్శించి, సురక్షితంగా స్వస్థలాన్ని చేరుకున్నది।






### మీరు కొంటారా?

బ్రామ్‌స్టోకర్ రచించిన సుప్రసిద్ధమైన నవల 'డ్రాకులా'. ఇందులోని డ్రాకులా పాత్ర, రొమానియాకు చెందిన వ్లాద్ అనే ఫ్యూడల్ ప్రభువు జీవితం ఆధారంగా రూపొందించబడింది. అతడు నివసించిన భవనం ఇప్పుడు అమ్మకానికి సిద్ధంగా ఉన్నది।

### తరుగనున్న చార్మినార్ శోభ!

హైదరాబాదులోని చార్మినార్ కట్టడం సుప్రసిద్ధమైనది. రోజురోజుకూ ఎక్కువయిపోతున్న వాతావరణ కాలుష్యం, ధ్వని కాలుష్యం కారణంగా, 400 సంవత్సరాల క్రితం, పాతనగరంలో నిర్మించబడిన అద్భుత భవనం, మునుముందు తన శోభను కోల్పోగలదని భావిస్తున్నారు।



# సోమరిపోతు

ఒక పెద్దమనిషి దారిన పోతూంటే, ఒక చెట్టు కింద పనీపాటా లేకుండా కూర్చుని వున్న, సోమరిపోతొకడు కనిపించాడు. వాణ్ణి మందలించే ఉద్దేశంతో ఆయన, "వయసులో వున్నావు. అలా ఊరికే కాలం గడపకపోతే, ఏదైనా పని చేసుకోరాదా!" అన్నాడు.

"పని చేస్తే ఏమొస్తుంది?" అని ఎదురు ప్రశ్న వేశాడు సోమరి.

"డబ్బు లిస్తారు," అన్నాడు పెద్దమనిషి.

"డబ్బు లొచ్చిం తర్వాత?" అని అడిగాడు సోమరి.

"ప్రయోజకుడి వయ్యావని, ఎవరైనా పిల్లనిచ్చి పెళ్ళి చేస్తారు," అన్నాడు పెద్దమనిషి.

"పెళ్ళయిం తర్వాత?"

"పిల్లలు పుడతారు, వాళ్ళతో ఆడుకోవచ్చు, పాడుకోవచ్చు."

"ఆ తర్వాత?" అంటూ రెట్టించాడు సోమరి.

"వాళ్ళు పెద్దయాక చదువు చెప్పించి, ప్రయోజకులుగా తీర్చిదిద్దాలి."

"ఆ తర్వాత?" అన్నాడు సోమరి.

"వాళ్ళు సంపాయించడం ప్రారంభిస్తారు. కాబట్టి, నీవు కాలు మీద కాలు వేసుకుని నిశ్చింతగా విశ్రాంతి తీసుకోవచ్చు," అని ఓపికగా చెప్పాడు పెద్దమనిషి.

"అయితే, ఇప్పుడు నేను చేస్తున్నది అదే కదా! మీరిక దయచేయవచ్చు," అన్నాడు సోమరి.

వాణ్ణి మార్చడం తనవల్ల కాదనుకుంటూ, తన దారిన తాను పోయాడు పెద్దమనిషి.

—బి. రఘురామరాజు






గౌరగిరిరాజు గౌరీనాధుడు చండశాసనుడు. ఆయనకు లావణ్య అనే పెళ్లీడుకు వచ్చిన కూతురున్నది. లావణ్య పేరుకు తగినట్టు, అపురూపలావణ్యవతి.

లావణ్య అందచందాల గురించి విని, చాలామంది రాకుమారులు ఆమెను పెళ్ళాడదలిచారు. అయితే, చండశాసనుడైన గౌరీనాధుడికి భయపడి, ఎవరూ ఆయనముందు యీ విషయం ఎత్తడానికి సాహసించలేదు.

గౌరగిరికి ఉత్తరాన, ఒక కీకారణ్యం వున్నది. ఆ అరణ్యంలో క్షుద్రశక్తులు నేర్చిన ఒక ముసలిది, తన కొడుకుతో నివసిస్తున్నది. ఆ ముసలిదాని కొడుకు ఒట్టి అనాకారి. వాడికి ఒక రోజున, అందమైన పిల్లను పెళ్ళాడాలన్న కోరిక కలిగింది. వాడు మాయాదర్పణంలో, గౌరగిరిలో అందరికన్న అందమైన పిల్ల ఎవరా అని చూశాడు. వాడికి లావణ్య కనిపించింది. వెంటనే వాడు బయలుదేరి, రాజు గౌరీనాధుణ్ణి కలుసుకుని, లావణ్యను తన కిచ్చి పెళ్ళి చెయ్యమని నిర్భయంగా అడిగాడు.

అసలే ముక్కోపి అయిన గౌరీనాధుడు, అడగక, అడగక తొలిసారిగా ఒక అనాకారి, అపురూప లావణ్యవతి అయిన తన కూతురును పెళ్ళాడతానని అడిగేసరికి పట్టరాని కోపం వచ్చి, తెల్లవారేసరికి వాణ్ణి ఉరి తీయించాడు.

ఎన్ని రోజులు గడిచినా, కొడుకు తిరిగి రాకపోయేసరికి, ముసలిది తన క్షుద్రశక్తుల సాయంతో జరిగినది తెలుసుకున్నది. వెంటనే అది పట్టరాని కోపంతో, ఒక రాత్రివేళ యువరాణి మందిరంలో ప్రవేశించి, నిద్రిస్తున్న యువరాణిని మాయం చేసింది.

పుల్లవరపు మనోహరరెడ్డి



రూపం ధరించి, మా శరీరాలు హూనం అయ్యేలా కొట్టింది,'' అని చెప్పారు.

రాజు చాలా ఆశ్చర్యపడి, స్వయంగా తానే అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ ఆయనకు లావణ్య కనిపించింది. అయితే, ఆమె తండ్రిని చూస్తూనే వెను దిరిగి పోసాగింది.

గౌరీనాధుడు, ఆమెను వెంబడించాడు. లావణ్య కొద్దిదూరం వెళ్ళి, మంత్రించిన ముగ్గుగీతను దాటి, హఠాత్తుగా ఒక మహా కాయుడి రూపం ధరించి, రాజు కేసి రాసాగింది. భయంకరమైన ఆ రూపాన్ని చూస్తూనే రాజు భయకంపితుడైపోయి, వెనుదిరిగి వచ్చిన దారిపట్టాడు.

నగరం చేరిన గౌరీనాధుడికి ఎక్కడ లేని దిగులు పట్టుకున్నది. ఆయన మంత్రులతో సంప్రతించి—ఎవరైతే యువరాణిని రక్షిస్తారో, వాళ్ళకే ఆమె నిచ్చి వివాహం జరిపిస్తానని, రాజ్యంలో చాటింపు వేయించాడు.

ఇది విని, లోగడ యువరాణిని వివాహ మాడాలనుకున్న కొందరు రాకుమారులు అరణ్యానికి వెళ్ళి, మహాకాయుడి రూపంలో వున్న లావణ్య చేత చావు దెబ్బలు తిని పారిపోయి వచ్చారు.

రాజధానీ నగరంలో, జయు డనే యువకు డొకడున్నాడు. వాడి తల్లి చిన్న

తర్వాత ముసలిది, రాజుపై పగ సాధించదలచి, యువరాణిని తన శక్తులతో మాయలో పడవేసి, అడవిలో ఒక చోట మంత్రించిన ముగ్గుతో ఒక గీతగీసి, లావణ్యను అక్కడే వదిలి, అరణ్యంలో మరొక ప్రాంతాన నివసిస్తున్న చెల్లెలి దగ్గిరకు వెళ్ళిపోయింది.

యువరాణి కనిపించక పోయేసరికి, రాజు వేగులను అన్ని దిక్కులకూ పంపి వెతికించాడు.

ఉత్తరదిక్కుగా పోయిన వేగులు, గాయాలతో తిరిగి వచ్చి, ''మహారాజా, యువరాణి అరణ్యంలో కనిపించి, మమ్మల్ని చూడగానే ఒక మహాకాయుడి

తనంలోనే చనిపోగా, తండ్రి, రెండో పెళ్ళి చేసుకున్నాడు. జయుడి పినతల్లికి, జయుడంటే పడేదికాదు. ఆమె పెద్ద వాడైన జయుణ్ణి అట్లావుంచి, చిన్నవాడైన తన కొడుక్కు వివాహ ప్రయత్నాలు ప్రారంభించింది.

ఇది చూసి నలుగురూ, ఆమెను తప్పు పట్టేసరికి, "జయుడికేం, తెలివిగలవాడు; సాహసవంతుడు. వాడు కావాలనుకుంటే యువరాణినే చేసుకోగలడు!" అని దెప్పి పొడిచింది.

ఈ మాటలు విన్న జయుడు బతుకు మీద విరక్తిచెంది, చావో బతుకో యువ రాణీ చేతిలో తేల్చుకోవాలని, అరణ్యానికి వెళ్ళాడు. జయుణ్ణి చూస్తూనే, యువరాణీ కొంతదూరం పరిగెత్తి మహాకాయుడి రూపం దాల్చింది.

ఇది చూసిన జయుడు అప్పటికి తిరిగి వచ్చి, రాత్రి వెన్నెల్లో తిరిగి అరణ్యానికి వెళ్ళి, యువరాణీ కనిపించిన చోట నేల మీద వెతికాడు. అక్కడ వాడికి ముగ్గుతో పొడవుగా గీసిన గీత ఒకటి కనిపించింది. యువరాణీ మహాకాయుడి రూపం ధరించ డానికీ, ఈ ముగ్గుగీతకూ సంబంధం వున్నదని, వాడు గ్రహించాడు.

ఆ వెంటనే జయుడు దాపులనున్న నీటివాగు దగ్గిరకు పోయి, ఒక ఆకు



దొన్నెలో కొంత నీరు తెచ్చి, ముగ్గును కడిగివేయాలని చూశాడు. కాని, అది చెక్కుచెదరలేదు!

జయుడికి ఏం చేయాలో తోచక, ఆ రాత్రంతా ఒక చెట్టు మీద గడిపాడు. తెల్లవారాక వాడికి, ఆ మంత్రపుముగ్గు వేసినవాళ్ళు, ఆ ప్రాంతాలే ఎక్కడైనా వుండవచ్చున్న అనుమానం కలిగింది. వెంటనే వాడు చెట్టు దిగి, ఆ చుట్టుపక్కల వెతుకుతూ తిరగసాగాడు.

జయుడికి ఒకచోట, శిథిలమైపోతున్న చిన్న పూరిపాకా, దానిముందు ఒక బండ రాయి మీద కూర్చుని వున్న ముసలిదీ కనిపించారు. వాడు, ఆ ముసలిది తప్పక



మంత్రగత్తె అయివుంటుందని వూహించి, దానికేసి నడవసాగాడు.

ముసలిది, వాణ్ణి అంతదూరాన చూస్తూనే, "ఎవరు నాయనా, నువ్వు?" అని అడిగింది.

అందుకు జయుడు, "అవ్వా, నేనీ దేశాన్నేలే రాజునూ కాదు, కోట్లకు పడగలెత్తిన వ్యాపారినీ కాదు — ఒక అనామకుణ్ణి. ముందు నువ్వామంత్రపు ముగ్గు గీతను చెరిపెయ్యి. తన కూతురుకు పట్టిన దుర్గతి చూసి, రాజుగారు పుట్టెడు దిగులుతో మంచానపడ్డాడు," అన్నాడు.

"అలాగా! మా అక్క కూడా, రాజుగారు తన కొడుకును ఉరి తీయించాడన్న దిగులుతో నిద్రాహారాలు మాని, యీ మధ్యనే పోయింది," అన్నది ముసలిది విచారంగా.

ఆ జవాబుకు జయుడు ఆశ్చర్యపోయి, "అయితే, రాకుమారి లావణ్యపై క్షుద్ర మంత్రాలు ప్రయోగించి, ఈ అరణ్యానికి తీసుకువచ్చింది, నువ్వు కాదన్న మాట!" అన్నాడు.

"అవును నాయనా, నేనుకాదు. నా మాట నమ్ము. తాను క్షుద్రదేవోపాసన చేసినందుకూ, ఏ పాపం ఎరగని రాకుమారిని బాధల పాలు చేసినందుకూ, మా అక్క ఆఖరిక్షణాల్లో ఎంతో పశ్చాత్తాప పడింది," అన్నది ముసలిది.

"ఊరికే పశ్చాత్తాపపడి ప్రయోజనం ఏమిటి? రాకుమారిని, తన దుష్ట మంత్ర ప్రభావం నుంచి బయటపడేలా చేస్తే బావుండేదికదా!" అన్నాడు జయుడు.

"అందుకు మా అక్క ఒక ఉపాయం చెప్పిపోయింది. కొంచెం ఆగు, చెబుతాను," అని, ముసలిది కొద్దిసేపు తనలో తాను ఏదో గొణుక్కుని, "నాయనా, యీ మంత్రతంత్రాలు నేర్చిన వాళ్ళ మాటలకు అర్థాలు వెతికి, వెలికితీయడం, నాబోటి దానివల్ల అయే పనికాదు. మా అక్క తన ఆఖరిక్షణాల్లో, రాకుమారిని మంత్ర ప్రభావంనుంచి తప్పించే బాధ్యత నామీద

పెట్టింది. అందు కావిడ చెప్పిందేమంటే—సవతులిద్దరిలో తలమీదావిడ దయాభిక్ష కోరు. మంత్రపు ముగ్గు మటుమాయమవుతుంది—అని. ఎన్నాళ్ళుగా ఆలోచిస్తున్నా, మా అక్క మాటల్లోని మర్మం నాకు తెలియడంలేదు!'' అన్నది.

జయుడు కొద్దిసేపు మౌనంగా తల వంచుకుని ఆలోచిస్తూ వుండిపోయి, తర్వాత ఉత్సాహంగా, ''అవ్వా, మీ అక్క మాటల్లోని మర్మం తెలిసిపోయింది. గంగ మన రాజ్యంలోంచి ప్రవహిస్తున్నదేగదా! ఇక్కడికి రెండామడలకన్న ఎక్కువ దూరం వుండదు. ఇంట్లో పాత్రలేమైనా వున్నవా?'' అని అడిగాడు.

''పాత్రలకేం తక్కువ, నాయనా. ఇత్తడి, రాగి, కంచు....'' అంటూ ముసలిది బండరాతిమీదినుంచి లేచింది.

జయుడు, ఆమెతోపాటు పాకలోకి పోయి, అక్కడ వున్నవాటిలో ఒక మరచెంబు తీసుకుని, అప్పటికప్పుడే గంగానది కేసి బయలుదేరాడు.

మర్నాడు సూర్యోదయం వేళ, జయుడు గంగాజలంతో రాకుమారి లావణ్య వున్న చోటుకు వచ్చాడు. లావణ్య అతణ్ణి చూస్తూనే మంత్రపు ముగ్గు దాటి దూరంగా పరిగెత్తి, అక్కడ మహాకాయుడి రూపం ధరించి, భయంకరంగా అరుస్తూ, వాడికేసి బయలుదేరింది.

ఈలోపల జయుడు, చెంబులోని గంగాజలాన్ని ముగ్గుమీద చిలకరించాడు. వెంటనే మొత్తం ముగ్గుగీతా ధూళిలా లేచి గాలిలోకి ఎగిరిపోయింది. ఆ మరుక్షణం లావణ్య తన ఎప్పటి రూపంతో, జయుడికేసి ఆశ్చర్యంగా చూడసాగింది.

జయుడు, ఆమెను సమీపించి, కొద్ది మాటల్లో జరిగిందేమిటో చెప్పి, రాజుగారి దగ్గిరకు తీసుకుపోయాడు.

గౌరీనాథుడు, తన కుమార్తెను మంత్ర గత్తెనుంచి కాపాడినందుకు జయుణ్ణి ఎంతగానో మెచ్చుకుని, చాటింపు ప్రకారం, లావణ్యను జయుడికిచ్చి వైభవంగా వివాహం జరిపించాడు.





# సందేహనివృత్తి

ధవళగిరి రాజ్యాన్ని, నాగదత్తుడనే రాజు ధర్మబద్ధంగా పాలించేవాడు. ఆయనకొక నాడు, ఒక ధర్మసందేహం కలిగింది. అదేమంటే — మనుషుల్లో ఉత్తమమైన వాణ్ణి గుర్తించడం ఎలా? అతడి ప్రవర్తన ఎలా వుంటుంది?

మర్నాడు ఆయన సభ తీరి, మంత్రులనూ, సభలో వున్నవారినీ తనకు కలిగిన సందేహానికి తగిన సమాధానం చెప్పవలసిందిగా కోరాడు. దానికి ఎవరికి తోచిన సమాధానం వారు చెప్పారు. అయినా, నాగదత్తుడికి అవేవీ నచ్చలేదు. ఆయన సందేహం, సందేహంగానే వుండిపోయింది.

కొన్నాళ్ళ తర్వాత, నాగదత్తుడు, తన ప్రధాన మంత్రితోపాటు కొందరు భటులను వెంటబెట్టుకుని, అరణ్యానికి వేటకు వెళ్ళాడు. అక్కడవాళ్ళు అడవిపందులనూ, లేళ్ళనూ బాణాలతో కొడుతూ, కొంతసేపటికి ఎవరికి వారుగా చెరొక దిక్కుకు విడిపోయారు.

మిట్టమధ్యాహ్నమయింది. అందరూ తిరిగి ఒకచోట కలుసుకుని రాజధానికి తిరిగి పోవాలన్న ప్రయత్నంలో, వేట చాలించి, ఒకరికోసం ఒకరు అరణ్యంలో వెతకసాగారు. అలాంటి సమయంలో, ఒక భటుడికి, మర్రిచెట్టుకింద కళ్ళు మూసుకుని దైవధ్యానం చేసుకుంటున్న, ఒక ముని కనిపించాడు.

గుర్రపు డెక్కల చప్పుడు విని, ఆ ముని కళ్ళు తెరిచి, మరొకదిక్కుగా చూస్తూ, "ఎవరువారు?" అని అడిగాడు.

ఆయన అంధుడని గ్రహించిన భటుడు, "ఓయ్, గుడ్డి సన్యాసీ! ఇటుగా ఎవరైనా వచ్చిన అలికిడి విన్నావా?" అని అడిగాడు.

గుడిమెళ్ళ రాజగోపాల్

అందుకు ముని, ''భటుడా! ఇటుగా ఎవరూ రాలేదు,'' అని జవాబిచ్చాడు నిదానంగా.

భటుడు అక్కడి నుంచి గుర్రాన్ని అదిలించి వెనుదిరిగి మరొక వైపుకు వెళ్ళిపోయాడు.

తర్వాత కొంతసేపటికి మంత్రి అక్కడికి వచ్చి, మునికి చూపులేదని తెలుసుకుని, ''మీరు అంధుల్లా వున్నారు. ఆ కారణంవల్ల, ఏ ప్రాణినీ చూడలేవు. అయినా ధ్వనినిబట్టి, దాపులనుంచి వెళ్ళింది మనిషో, జంతువో ఊహించగలవుగదా. ఇంతకు ముందు యిటుగా ఎవరైనా వెళ్ళిన ధ్వని విన్నావా?'' అని అడిగాడు.

''మంత్రివర్యా! ఇప్పుడే ఒక భటుడు ఇటుగా వచ్చి వెళ్ళాడు,'' అన్నాడు ముని.

మంత్రి గుర్రాన్ని అదిలించి, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత కొంతసేపటికి రాజు నాగదత్తుడు, అటుగా వచ్చి, అక్కడ ఉన్న ముని అంధుడని గ్రహించి, గుర్రం దిగి, ఆయన ముందుకు వచ్చి నమస్కరించి, వినయంగా, ''మునీశ్వరా! నేను కొందరితో కలిసి వేటకు వచ్చి, వారి నుంచి వేరుపడిపోయాను. వాళ్ళల్లో ఎవరైనా యిటుగా వచ్చిన శబ్దం తమరు ఆలకించారా?'' అని అడిగాడు.

దానికి ముని, ''మహారాజా, ఇంతకు కొద్దిసేపటికిందట, తమ భటుడూ, మహా



మంత్రీ వచ్చి వెళ్ళారు." అని జవాబు చెప్పాడు.

"వాళ్ళు ఏ దిశగా వెళ్ళారో సెలవివ్వ గలరా?" అని అడిగాడు రాజు.

ముని, వాళ్ళు వెళ్ళిన దిశకేసి చేయి ఎత్తి చూపించాడు.

రాజు, ఆ దిశగా వెళ్ళి, తన పరివారాన్ని కలుసుకున్నాడు. అప్పుడాయనకు, ముని తన భటుణ్ణీ, మంత్రినీ సంబోధించిన తీరు విని చాలా ఆశ్చర్యం కలిగింది. అంధుడైన ఆ ముని, భటుణ్ణి భటుడుగా, మంత్రిని మంత్రిగా, తనను రాజుగా గుర్తించాడన్నమాట! ఇది ఎలా సాధ్యమైంది?

రాజు తన సందేహాన్ని తీర్చుకునేందుకు, మరొకసారి ముని దగ్గిరకు వెళ్ళి, భటుణ్ణీ, మంత్రినీ, తననూ—తమ తమ పదవులతో సహా, ఎలా గుర్తించగలిగారని అడిగాడు.

దానికి ముని చిరునవ్వునవ్వి, "మహారాజా, భటుడు నన్ను, ఓయ్, గుడ్డి సన్యాసీ! అంటూ పలకరించాడు. దాన్నిబట్టి అతడు భటుడని గ్రహించాను. ఇక మంత్రి, ముందుగా నా అంధత్వాన్ని ఎత్తిచూపి, ఒక విధమైన అధికార స్వరంతో ప్రశ్నించాడు. అందువల్ల, ఆయన మంత్రి, అని తెలుసుకున్నాను. ఆ తర్వాత మీరు వచ్చి, గుర్రం దిగి, నా అంధత్వాన్ని గురించి వేలెత్తి చూపకుండా, జరిగినది చెప్పి—ఎవరైనా యిటుగా వచ్చిన శబ్దం ఆలకించారా? అని అడిగారు. దాన్నిబట్టి, మీరు రాజని గ్రహించాను. అంటే—మీ ముగ్గురూ నన్ను సంబోధించిన తీరునుబట్టి, ఎవరు ఎవరైనదీ, నాకు అర్థమైంది." అని జవాబిచ్చాడు.

ముని మాటలతో, రాజుకు కొంత కాలంగా ఉన్న సందేహ నివారణ కలిగింది. మనిషి వేరొక మనిషితో ప్రవర్తించే తీరునుబట్టి, వాళ్ళల్లో ఉత్తముణ్ణి గుర్తించవచ్చుని, ఆయన అర్థం చేసుకున్నాడు.






# 5

[యువరాజును మింగడానికి వచ్చిన మహామృగాన్ని వినోదుడు హతమార్చాడు. పూజారి ఆజ్ఞానుసారం భటులు వినోదుణ్ణి కారాగారంలో బంధించారు. అర్ధరాత్రి సమయంలో రాజు ఒంటరిగా వచ్చి, వినోదుణ్ణి రాజభవనం ఉపరితలం మీది బురుజులోపలికి తీసుకుపోయి, అక్కడి నుంచి జ్ఞానభూమిలో జరిగే వింతలనూ, విశేషాలనూ చూపసాగాడు. తరవాత—]

విలాపసమావేశంలో పాల్గొనడానికి వచ్చిన ప్రజలనుద్దేశించి మళ్ళీ, "మనం త్వరలో మరొక మహామృగాన్ని సంపాయించగలం," అన్నాడు పూజారి.

"ఎలాగో ఉన్న మహామృగంపోయింది. అది లేకుంటే మనం బతకలేమా? కొత్తగా మరొక మహామృగం ఎందుకు?" అన్నాడు కూర్చున్న పౌరులలో ఒకడు లేచి నిలబడుతూ.

"నువ్వు లేకపోయినా మునిగిపోయిందేమీలేదులే," అంటూ పూజారి చేతులు తట్టాడు. వెంటనే ఇద్దరు భటులు వచ్చి, ఆ పౌరుణ్ణి అక్కడి నుంచి లాక్కుపోయారు!

"పౌరులారా! మీకందరికీ ఒక శుభవార్త. పవిత్రమైన మహామృగాన్ని చంపి, మనచేత బందీగా పట్టుబడిన ఆ రాక్షసుణ్ణి హతమార్చి, మనం ఉత్సవం జరుపుకుంటాము," అన్నాడు పూజారి.

మనోజ్ దాస్



మౌనం వహించి, ఘోరున ఏడ్వడం ప్రారంభించాడు! కొన్ని వందల కంఠాలు, ముక్కుతూ, మూల్గుతూ, రోదిస్తూ అతణ్ణి అనుకరించాయి. కళ్ళ నుంచి కన్నీటి ధారలు వాళ్ళ చెంపలమీదుగా జారాయి. కొందరు నెత్తి, నోరూ మొత్తుకుంటూ రోదిస్తూ, బట్టలు చింపుకోసాగారు. జుట్టు పీక్కోసాగారు. ఒక్క నిమిషంలో మంటప మంతా భీకరమైన రోదనలతో ప్రతిధ్వనించింది.

వినోదుడు ఆ విషాదదృశ్యాన్ని చూసి భరించలేకపోయాడు. రాజు దానిని గ్రహించి, ఆ దృశ్యాన్ని ఆపి, "నిద్రలేమి వల్ల జనించే రుగ్మతను, మా పౌరులు ఇలా పోగొట్టుకుంటారు," అన్నాడు.

"మీ ప్రయత్నాలన్నీ ప్రయోజనం లేనివి మహారాజా! ప్రజలను ఏడ్పించడం మాని, వాళ్ళను నవ్వేవిధంగా ఎందుకు చేయకూడదు?" అని అడిగాడు వినోదుడు.

"ఏం చేయమన్నావు ?" అని ప్రశ్నించాడు రాజు.

"నవ్వే విధంగా చేయమన్నాను, మహారాజా !" అన్నాడు వినోదుడు.

"నవ్వే విధంగానా! నవ్వంటే ఏమిటి?" అని అడిగాడు రాజు అమాయకంగా.

"నవ్వు, మహారాజా! నవ్వు," అన్నాడు వినోదుడు మళ్ళీ.

వినోదుడు రాజు కేసి చూశాడు. రాజు తల అడ్డంగా ఊపుతూ, "వీలుకాదు. అతడలా చేయడానికి నేను అనుమతించను," అన్నాడు.

"చాలా కృతజ్ఞుణ్ణి, మహారాజా! అయినా, రాజుగారయిన తమను సంప్రదించకుండా, ఆ పూజారి నన్ను చంపుతానని ప్రకటించడం దుర్మార్గం కాదా! మీ మీద అధికారం చెలాయించడానికి ఆ నరరూపరాక్షసుణ్ణి, ఎందుకు అనుమతిస్తున్నారు ?" అంటూ వినోదుడు తన దృష్టిని మళ్ళీ పూజారి కేసి మళ్ళించాడు.

"ఇప్పుడు, మనం మన దినచర్యకు వద్దాం," అని పూజారి మూడు క్షణాలు

"అదే నేను అడుగుతున్నది. నవ్వు అంటే ఫలానా అని స్పష్టంగా చెప్పు," అన్నాడు రాజు.

"భగవంతుడా! నిజంగానే మీకు నవ్వంటే ఏమిటో తెలియదా," అని అడిగాడు వినోదుడు ఆశ్చర్యంగా.

ఆ ప్రశ్న రాజును మరింత ఇబ్బంది పెట్టింది. జ్ఞానభూమివాసులకు నవ్వంటే ఏమిటో నిజంగానే తెలియదు. వాళ్ళు ఎప్పుడూ నవ్వి ఎరుగరు!

వినోదుడు రాజుకు నవ్వి చూపాలని ప్రయత్నించాడు. కాని, నవ్వలేకపోయాడు!

"రాజా, మీరూ, మీ జ్ఞానభూమి పౌరులూ ఎంతో సాధించి ఉన్నప్పటికీ, అది ఎందుకూ కొరగాదు. ఒకవిధంగా మీరంతా దురదృష్టవంతులు; శాపగ్రస్తులనే చెప్పాలి. నేనే రాజుగా వుండి, ఏవేవో అద్భుతశక్తులు — నక్షత్రాలను ధ్వంసంచేసే శక్తితో సహా ఎన్ని అద్భుత శక్తులు ఉన్నప్పటికీ, వాటన్నిటిని సైతం, వదులుకుని హాయిగా నవ్వేశక్తిని సంపాయించడానికి వెనుకాడను," అన్నాడు ఆవేశంతో.

వినోదుడి మాటలలో ధ్వనించిన నిజాయితీ రాజుకు సంతోషం కలిగించింది. రాజు కొంతసేపు మౌనం వహించాడు.



ఉన్నట్టుండి ఒక గోపురంమీద పసుపు రంగు దీపం వెలిగింది. వెనువెంట గంటానాదం వినిపించింది.

"దీని అర్థం, ఏదో సరికొత్త పరిశోధన ఫలించిందన్నమాట. బహుశా మనోదర్పణమే అయివుంటుంది," అన్నాడు రాజు.

రాజూ, వినోదుడూ బురుజునుంచి వెలుపలికి వచ్చారు. వాళ్ళు వెలుపలికి రాగానే, ద్వారం మాయమయింది.

మెట్లమీద ఎవరో వస్తూన్న చప్పుడు వినిపించింది. వినోదుణ్ణి చాటుగా ఉండమని, రాజు చేయెత్తి సంజ్ఞ చేశాడు.

"మనోదర్పణం సిద్ధమయింది, మహారాజా!" అంటూ ఇరువురు పండితులు



అక్కడికి వచ్చి, గుడ్డతో కప్పబడి ఉన్న ఒక అద్దాన్ని రాజుగారికి అప్పగించి, "మీరు ఎవరినైనా తలుచుకుని, వారి పేరును ఉచ్చరిస్తూ, ఈ దర్పణాన్ని మూడుసార్లు తుడిచి, అందులోకి చూసి నట్టయితే, ఆ వ్యక్తి మీ గురించి ఇటీవల ఏమనుకుంటున్నదీ స్పష్టంగా కనిపి స్తుంది," అన్నారు సంతోషంగా.

"మీ కృషి ఫలించినందుకు చాలా సంతోషం! మొట్టమొదట, మన ముఖ్య శ్రేయోభిలాషి అయిన పూజారి మనసును ఇప్పుడు మనోదర్పణంలో తిలకిద్దాం," అంటూ, రాజు మనోదర్పణం మీది గుడ్డను తొలగించబోయాడు.

"ఆగండి!" అని అరుస్తూ పూజారి అక్కడ ప్రత్యక్షమై, "ఆ మనోదర్పణాన్ని మొదట నేనే ఉపయోగించాలి. పైగా అది, పూజారినైన నా సంరక్షణలోనే ఉండాలి," అన్నాడు పట్టుదలగా.

ఆ క్షణంలో ఏమి చెప్పడానికీ తోచక రాజు మౌనం వహించాడు.

"ఈ మనోదర్పణాన్ని ఉపయోగించు కోవడం రాజుగారైన మీ హక్కు అన్న సంగతి మరచిపోకండి, మహారాజా! పూజారి మనసు ఎటువంటిదో, ఈ క్షణమే తెలుసుకోండి," అంటూ చాటునుంచి, వాళ్ళముందుకు వచ్చాడు వినోదుడు.

"వీలుకాదు, కాదు, కాదు," అని అరుస్తూ, పూజారి రాజుగారినుంచి మనో దర్పణాన్ని లాక్కోబోయాడు. వినోదుడు ముందుకు దూకి పూజారికి అడ్డుపడ్డాడు.

ఇంతలో రాజు, మనోదర్పణం మీది గుడ్డను తొలగించి, పూజారి పేరు చెబుతూ దానిని మూడుసార్లు తుడిచి చూశాడు. అందులోని దృశ్యం చూసి, అదిరిపడి, అద్దాన్ని దూరంగా విసిరి, కత్తిదూసి ఒక్క క్షణంలో పూజారి తలను తెగవేశాడు!

"ఏం పని చేశారు, మహారాజా!" అన్నాడు వినోదుడు దిగ్భ్రాంతితో.

"అవును, ఆ క్షణంలో ఏం చేసిందీ నాకే తెలియడం లేదు," అంటూ కొంత



"రాజు అన్న తరవాత ఖడ్గం లేకుండా ఉండకూడదు మహారాజా," అంటూ వినోదుడు కత్తిని తీసి, రాజు నడుముకు వేలాడుతున్న ఒరలో పెట్టాడు.

"నేను మనోదర్పణంలో చూసిన విధంగా పూజారి నా శత్రువు అన్న విషయం నిజమేనా ?" అని అడిగాడు రాజు కాస్త అనుమానంగా.

"సందేహమెందుకు మహారాజా, మనో దర్పణాన్ని మరొకసారి పరీక్షించి చూడండి," అన్నారు దానిని రూపొందించిన పండితులు ఏకకంఠంగా.

"మంచిసలహా !" అని రాజు వినోదుడి కేసి తిరిగి, "నువు మానవరూపంలో ఉన్న రాక్షసుడవనీ, మాకేదో హాని కలిగించే ఉద్దేశంతోనే ఇక్కడికి వచ్చావనీ పూజారి నిన్ను గురించి చెప్పేవాడు. అది ఎంత వరకు నిజమో, ఇప్పుడు మనోదర్పణం ద్వారా తెలుసుకుంటాను," అంటూ ఒక్క క్షణం కళ్ళు మూసుకుని, వినోదుడి పేరు స్మరిస్తూ మనోదర్పణంలోకి చూశాడు.

మొదట ఆశ్చర్యం చెందిన రాజు, కొంతసేపటికి ఆనందంతో నవ్వుతూ, వినోదుడికేసితిరిగి, "నువ్వు, ఒక మహాకార్యం సాధించడానికి మా జ్ఞానభూమి కుండా వెళ్ళనున్నావు. ప్రయాణం సుకరం కావడానికి నువ్వు మా సహాయాన్ని కూడా

సేపు ఆగి, "నేనా అద్దంలోకి చూసేసరికి, పూజారి వికృతంగా పళ్ళు కొరుకుతూ, కత్తి దూసి నామీదికి రావడం కనిపించింది. అది బింబం అన్న మాట మరిచిపోయి, నిజమనుకుని, ఆత్మరక్షణకోసం అతణ్ణి నిజంగానే హతమార్చాను," అన్నాడు రాజు, రక్తంలో పడి ఉన్న పూజారి తల కేసి చూస్తూ, కాస్త బాధతో.

"అంటే, ఆ పూజారి మిమ్మల్ని హత మార్చాలని ఆలోచిస్తూ ఉండేవాడన్న మాట మహారాజా !" అన్నారు పండితులు ఆశ్చర్యంగా.

రాజు చేతి నుంచి, కత్తిజారి కింద పడింది.

అపేక్షిస్తున్నావు. అంతే కాని, నీకు మాపట్ల ఎటువంటి శత్రుత్వమూ, దురుద్దేశమూ లేదు. పైగా నువ్వు మా శ్రేయోభిలాషివే!" అన్నాడు రాజు.

వినోదుడి కళ్ళవెంట ఆనందబాష్పాలు రాలాయి. "నేను మీతో చెప్పాలనుకున్న మాటలను మీరే చెబుతున్నారు మహారాజా! ఒక వరం సాధించడానికి నేను ఈ జ్ఞానభూమిని దాటి వెళ్ళాలి. అందుకు మీ సహాయం కావాలి," అన్నాడు వినోదుడు.

రాజు కొంతసేపు మౌనం వహించి, అక్కడ ఉన్న పండితులను వెళ్ళమని సైగచేశాడు. వాళ్ళు వెళ్ళాక రాజు వినోదుడితో, "ఈ జ్ఞానభూమికి అవతల ఉన్న ప్రాంతానికి మేమెవ్వరమూ వెళ్ళలేదు. అయినా, అది ఎటువంటిదో మాకు తెలుసు. ఆ ప్రదేశానికీ, మా జ్ఞానభూమికీ మధ్య విషవాయువులు చిమ్మే పర్వత శ్రేణులు ఉన్నాయి. ఆ విషవాయువులకు తట్టుకుని ఏ ప్రాణి కూడా అవతలికి పోజాలదు," అన్నాడు.

"మహారాజా! ఆ విషవాయువులను దాటి అవతలికి వెళ్ళడానికి మీరు మాత్రమే నాకు సహాయం చేయగల సమర్థులు," అన్నాడు వినోదుడు.

"నేనెలా సహాయం చేయగలనో చెప్పు," అని అడిగాడు రాజు.



"ఒకచోట మాయమై, మరొక చోట ప్రత్యక్షమయ్యే రహస్యాన్ని నాకు ఉపదేశిస్తే చాలు మహారాజా!" అన్నాడు వినోదుడు.

రాజు మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

"మహారాజా, నేను నా యాత్రలో విజయం సాధించినట్టయితే, మీ కందరికీ హాయిగా నవ్వే వరాన్ని తీసుకువస్తాను," అన్నాడు వినోదుడు.

"నవ్వే వరమా! అదేమిటో నాకు స్పష్టంగా తెలియడంలేదు. అయినా అదేదో గొప్పదనే విషయం మాత్రం తెలుస్తున్నది. కాని, నువ్వు తెలుసుకోవాలనే రహస్యం చాలా విలువైనది నాయనా! అది ఈ జ్ఞాన భూమిలో ఇద్దరికి—అంటే

నాకూ, పూజారికీ మాత్రమే తెలిసిన పరమరహస్యం!" అన్నాడు రాజు.

"ఆ రహస్యం, దానిని కనుగొన్న పండితులకు తెలుసుకదా మహారాజా," అని అడిగాడు వినోదుడు అనుమానంగా.

"నిజమే వారికి తెలుసు. అయితే, దానిని వారు ఉపయోగించే అవసరం లేకుండాచేశాడుపూజారి!" అన్నాడురాజు.

"అంటే, ఆ రహస్యం తెలుసుకున్న వెంటనే పూజారి వాళ్ళను హతమార్చా డన్న మాట!" అన్నాడు వినోదుడు.

రాజు అవునన్నట్టు తలాడించి, "సరే, ఈ విషయంగురించితరవాత చెబుతాను," అన్నాడు.

సరే అన్నాడు వినోదుడు.

రాజు ఒక నిర్ణయానికి రావడానికి ఒక వారం పట్టింది. అంతలో వినోదుడు యువరాజు ప్రేమకు మరింత పాత్రు డయ్యాడు.

ఒకనాడు యువరాజును చూసి, వినో దుడు, "ఎంతటి అందమైన యువరాజువి! అయినా నవ్వలేవు. నవ్వి చూపుదామన్నా, శాపగ్రస్తమైన ఈ జ్ఞానభూమిలో నేనే నవ్వలేకపోతున్నాను," అన్నాడు బాధగా.

దానిని గమనించిన రాజు, యువ రాజుతో సహా వినోదుణ్ణి తన వెంట రమ్మని, జ్ఞానభూమి సరిహద్దులవరకు తీసుకు పోయాడు. అక్కడ రాజు అతనికి మాయమయ్యే రహస్యాన్ని ఉపదేశించి, "మాయమైన తరవాత అదేస్థితిలో ఉండడం ప్రమాదకరం. విషవాయువులు చిమ్మే పర్వతశ్రేణులు దాటిన వెంటనే మానవరూపంలో ప్రత్యక్షం కావాలి. ఈ సంగతి మరిచిపోవద్దు. అదృశ్య రూపంలో చాలాకాలం ఉండడం క్షేమంకాదు." అని హెచ్చరించాడు!

వినోదుడు అదృశ్యమవడానికి ముందు, రాజూ, యువరాజూ అతనికి వీడ్కోలు పలికారు. రాజు ఉపదేశించిన రహస్య సూత్రం ప్రయోగించి, వినోదుడు క్షణా లలో శక్తితరంగాలుగా మారి, అదృశ్య మయ్యాడు! —(ఇంకావుంది)






# వినీలుడి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కార్యసాధనపట్ల, నీ పట్టుదల మెచ్చదగిందే. కాని, నువ్వు ఆశించినట్టు కార్యం సఫలమయ్యాక, పరిస్థితులు ఎలా వుండగలవో అన్న శంక, నన్ను బాధిస్తున్నది. ఎందుకంటే, ఒక్కొక్కసారి కార్యవైఫల్యమేగాక, కార్యసాఫల్యం కూడా, ఎంతటి మేధావులనైనా చిక్కుల పాల్జేస్తుంది. ఇందుకు ఉదాహరణగా మహాపండితుడూ, కవీ అయిన వినీలుడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ యిలా చెప్పసాగాడు:

పూర్వం జ్ఞానసాగరు డనే పండితుడుండేవాడు. అయనకు ఒక్కతే కుమార్తె:

## బేతాళ కథలు



పేరు లలిత. ఒకసారి వినీలు డనే యువకుడు, జ్ఞానసాగరుడి వద్ద శిష్యరికం కోసం వచ్చాడు. జ్ఞానసాగరుడు, అతణ్ణి పరీక్షించి, అతడి తెలివితేటలకు తృప్తిపడి, తన శిష్యబృందంలో చేర్చుకున్నాడు. సహజంగా మేధావి అయిన వినీలుడు, జ్ఞానసాగరుడి శిష్యరికంలో మెరుగులు దిద్దుకుని, అచిరకాలంలోనే అన్ని విద్యల లోనూ గొప్ప ప్రతిభావంతుడయ్యాడు.

విద్యాభ్యాసం పూర్తి అయ్యాక వినీలుడు, రాజాశ్రయం సంపాదించడానికి నిశ్చయించుకున్నాడు. జ్ఞానసాగరుడికి గురుదక్షిణ చెల్లించి, ఆయన అనుమతి పొందదలిచాడు.

వినీలుడు చెప్పినది విని, జ్ఞానసాగరుడు ఒక్క నిమిషం మౌనంగా వుండి, "వినీలా, నేను కోరినది ఏదైనాసరే గురుదక్షిణగా యివ్వగలవా?'' అని అడిగాడు.

''గురుదేవా, నా శక్తికి తగినది ఏదైనా సరే యివ్వడానికి, నేను సిద్ధంగా వున్నాను,'' అన్నాడు వినీలుడు ఎంతో వినయంగా.

వినీలుడిసమాధానానికి, జ్ఞానసాగరుడు తృప్తిపడి, ''నాకు వేరే కోరిక ఏదీలేదు, నాయనా! విద్యాబృహస్పతివి అయిన నువ్వు, గుణవతి అయిన నా కుమార్తె లలితను వివాహమాడితే చాలు,'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

జ్ఞానసాగరుడి కోరిక వింటూనే, వినీలుడు వ్యాకులపడి, ''ఎంతటి అగ్నిపరీక్ష పెట్టారు, గురుదేవా! మిమ్ములను పితృసమానుడిగానూ, మీ కుమార్తెను సహోదరిగానూ భావిస్తున్నాను. ఆమెను వివాహం చేసుకోమనడం ధర్మమా?'' అన్నాడు.

వినీలుడి జవాబు విని ఖిన్నుడైపోయిన జ్ఞానసాగరుడు, ''వినీలా, గురుపుత్రిని వివాహమాడరాదని ఎక్కడా లేదు,'' అంటూ చాలాసేపు రకరకాల దృష్టాంతాలతో, వినీలుడికి ఎంతగానో నచ్చజెప్ప జూశాడు.

ఎంత చెప్పినా వినీలుడు, లలితను వివాహమాడడానికి అంగీకరించలేదు. దానితో జ్ఞానసాగరుడికి ఎక్కడలేని కోపావేశం కలిగింది.

ఆయన కమండలంలోని నీరు చేతిలోకి తీసుకుని, "నీలో యింత అహంభావం వున్నదని గుర్తించలేకపోయాను. గురుదక్షిణ చెల్లించని పాపానికి నువ్వు నీ విద్యలన్నీ మరిచిపోయి, సామాన్య మానవుడిలా బ్రతుకుదువుగాక!" అని శపించాడు.

గురుశాపం వినగానే, వినీలుడికి ఒక్కసారిగా శోకం ముంచుకువచ్చింది. అతడు కన్నీళ్ళతో జ్ఞానసాగరుడికి ప్రణమిల్లి, "నేను చెల్లెలిగా భావించిన స్త్రీని వివాహమాడలేను. దానికంటే, మీరు విధించిన శిక్షనే సంతోషంగా స్వీకరిస్తాను," అని వెళ్ళిపోయాడు.

అలా వెళ్ళిన వినీలుడు, కొన్నాళ్ళపాటు పిచ్చివాడిలా దేశమంతా తిరిగాడు. చివరికి ఒక రోజు, అతడు చాలా నీరస స్థితిలో శ్రీరంగపట్టణానికి చేరుకుని, శ్రీరంగనాధుని కోవెలముందు స్పృహతప్పి పడిపోయాడు.

ఆ సమయంలో, శిష్యులతోపాటు శ్రీరంగనాధుని దర్శనం కోసం వచ్చిన, కృష్ణస్వామి అనే మహాపండితుడు వినీలుణ్ణి చూసి, జాలిపడి తన శిష్యులసాయంతో ఇంటికి తీసుకువెళ్ళి శైత్యోపచారాలు చేయించాడు.





వినీలుడి కవితాపటిమకు, పదలాలిత్యానికి, శబ్దసౌష్ఠవానికి కృష్ణస్వామీ, ఆయన శిష్యులూ చాలా ఆశ్చర్యపడ్డారు.

కృష్ణస్వామి, వినీలుణ్ణి లేవదీశాడు. వినీలుడు, ఆయనకు నమస్కరిస్తూ, "మీరెవరు, స్వామీ? నేనిక్కడికి ఎలా వచ్చాను?" అని అడిగాడు.

కృష్ణస్వామి జరిగినదంతా, అతడికి చెప్పి, "ఎవరు నాయనా, నువ్వు? శ్రీరంగనాధుని మీద, నువ్వు ఆశువుగా చెప్పిన కవిత్వం వింటూంటే, నా జన్మ ధన్యమైందనిపించింది. ఇంతటి సరస్వతీ పుత్రుడివి, యిలా దీనమైన స్థితిలో వుండడానికి కారణమేమిటి?" అని ప్రశ్నించాడు.

"మీరు చెప్పేది నిజమేనా, స్వామీ? ఇంతకుముందు నేను, శ్రీరంగనాధుని మీద ఆశుకవిత్వం చెప్పడం యధార్థమేనా?" అన్నాడు వినీలుడు.

కృష్ణస్వామి చిరునవ్వునవ్వి, "నువ్వు మొదట చెప్పిన రెండు, మూడు శ్లోకాలు విని చాలా ఆశ్చర్యపోయాను. ఆ తర్వాత, నీనోటి నుంచి వెలువడిన ప్రతి అక్షరాన్నీ, నా శిష్యులచేత వ్రాయించాను, చూడు!" అంటూ, తన శిష్యుడిచేతిలోని తాళపత్రాలను తీసుకుని, వినీలుడికి యిచ్చాడు.

వినీలుడు, తాను చెప్పిన శ్లోకాలను తిరిగి చదువుతూంటే, అతడికళ్ళనుంచి

కొంతసేపటికి వినీలుడికి స్పృహ వచ్చింది. అతడు కళ్ళు తెరిచే సమయానికి, ఇంటిముందున్న ఆవరణలో, కృష్ణస్వామి శిష్యులు, ఎంతో భక్తిశ్రద్ధలతో శ్రీరంగనాధుని స్తోత్రగీతాలు చదువుతున్నారు. భక్తిరస పూరితమైన ఆ ప్రశాంత వాతావరణంలో, వినీలుడు ఆశువుగా శ్రీరంగనాధుని మీద ప్రస్తుతి శ్లోకాలు చెబుతూ లేచాడు.

ఆ ఆవేశంలో, అతడి ఆశుధారా కవిత్వం, ఒక గంటసేపు సాగింది. ఆ తర్వాత కొంతసేపటికి వినీలుడు సొమ్మసిల్లి కృష్ణస్వామి పాదాలముందు వాలిపోయాడు.

ఆనందబాష్పాలు రాలాయి. తన గురువు జ్ఞానసాగరుడిచ్చిన శాపం పనిచెయ్యలేదని, అతడికి అర్థమైంది.

"ఇంతకూ నువ్వెవరైనదీ చెప్పనే లేదు?" అన్నాడు కృష్ణస్వామి.

వినీలుడు జరిగినదంతా వివరంగా కృష్ణస్వామికి చెప్పాడు.

"సరే, నాయనా! నువ్వు కొన్నాళ్ళ పాటు, మా ఇంటనే వుండు. పద, స్నానం చేసి, భోజనం చేద్దువుగాని," అన్నాడు కృష్ణస్వామి.

ఆ మాటలు అంటున్నప్పుడు, కృష్ణస్వామి ముఖంలో, వెనుకటి ప్రశాంతత లేకపోవడం గమనించాడు వినీలుడు. అయితే, అతడు దాన్ని పట్టించుకోలేదు.

భోజనం చేశాక వినీలుడు, కృష్ణస్వామి దగ్గిరకువచ్చి, "ఈ పట్టణాన్నేలే రాజు ఎవరు, స్వామీ? పండితపోషకుడేనా? ఎవరైనా శాస్త్ర ప్రతిభగల పండితులున్నారా?" అంటూ, యింకా ఏదో అడగబోయాడు.

అయితే కృష్ణస్వామి చెయ్యి ఎత్తి, అతణ్ణి వారిస్తూ, "ఆ వివరాలన్నీ సమయం వచ్చినప్పుడు, నేనే చెబుతాను. వెళ్ళి విశ్రాంతి తీసుకో," అన్నాడు.

ఆ మర్నాటినుంచీ వినీలుడు, ఏదో ఒక అంశంమీద ఆశువుగా కవిత్వం చెప్పడం ప్రారంభించాడు. అయితే, చిత్రంగా, అతడి పాండిత్యం, కవిత్వంలోని మాధుర్యం, నానాటికి దిగజారుతూ





వచ్చాయి. చివరకు, అతడు చెప్పే కవిత్వంలో రసపుష్టి మాట అటుంచి, శబ్దార్థాలు కూడా వికృతంగా ధ్వనించసాగాయి. అతడి కవిత్వం వింటున్న కృష్ణస్వామి శిష్యుల ముఖాల్లో ఏవగింపు కనిపించసాగింది. వినీలుడు, యీ మార్పును కొంతవరకు గమనించాడు.

ఇలాంటి పరిస్థితిలో, ఒకసారి కృష్ణస్వామి శిష్యులు యిద్దరు మాట్లాడుకుంటుండగా, ఆ సంభాషణ వినీలుడి చెవినపడింది.

"ఈ మధ్య వినీలుడి ప్రవర్తన, ఎంత అహంభావ పూరితంగా వుంటున్నదో చూశావా?" అన్నాడు ఒకడు.

"అవును. మొదటిరోజున శ్రీరంగనాధుడు ఏం కరుణించాడో ఏమో, అమృత గుళికల్లాంటి శ్లోకాలు చెప్పాడు. ఇప్పుడు చూడు, ఎలాంటి శుష్కపదాలతో కవిత్వం అల్లుతున్నాడో! అయినా అతడికి ఇంకా కళ్ళు తెరుచుకోవడం లేదు," అన్నాడు రెండవవాడు.

"మొన్న గురువుగారు ఏమన్నారో తెలుసా? 'వినీలుడు తాను చాలా అధికుణ్ణనుకుంటున్నాడు, నాయనా! అతడికి యింకా ఆత్మజ్ఞానం కలగలేదు.' అన్నారు," అన్నాడు మొదటివాడు.

వాళ్ళ మాటలు విన్న క్షణం నుంచి వినీలుడిలో, అంతరంగమథనం ప్రారంభమైంది.

చివరకు అతడు, కృష్ణస్వామి దగ్గిరకు వెళ్ళి భక్తితో పాదాభివందనం చేసి, "సూక్ష్మాతి సూక్ష్మమైన ధర్మస్వరూపాన్ని ఇన్నాళ్ళు అర్థం చేసుకోలేకపోయాను, స్వామీ! మీ దయవల్ల, నా కళ్ళు తెరుచుకున్నాయి. నేను, ఒకసారి, నా గురువు వద్దకు వెళ్ళి వస్తాను; నన్ను ఆశీర్వదించండి!" అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఆశుకవిత్వాన్ని అంత మధురంగా చెప్పగలిగినందుకు, వినీలుడు గర్వపడి వుండవచ్చు. అయితే, అతడి కవితాపటిమ

క్షమించడానికి కారణం ఏమిటి? జ్ఞాన సాగరుడు, వినీలుడికిచ్చిన శాపం, ఎందుకు ఫలించలేదు? వినీలుడు మళ్ళీ జ్ఞాన సాగరుడివద్దకు వెళతాననడమేమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''వినీలుడు గర్వించినది, తానొక గొప్ప కవినన్న భావం వల్ల కాదు; తానొక మహత్తరమైన వ్యక్తి నన్న భావంవల్ల. గురువు తన కిచ్చిన శాపం ఫలించకపోవడంతో, అతడిలో, ఆ అహంభావం కలిగింది. అయితే, వినీలుడు యిక్కడ, ఒక సత్యాన్ని గుర్తించలేదు. అదేమిటంటే—జ్ఞానసాగరుడి శాపం విఫలమవడానికి కారణం, ఆయన దుర్బలత్వమే గాని, వినీలుడి ఔన్నత్యం కాదు. జ్ఞానసాగరుడు, వినీలుణ్ణి, తన కుమార్తెను వివాహమాడమని మామూలుగా అడగకుండా, గురుదక్షిణగా కోరాడు. ఆ కోరికలో నిర్బంధించడమూ, ఆజ్ఞాపించడమూ లాంటి లక్షణాలున్నవి. వినీలుడు చెప్పిన జవాబుకు, ఆయన గురువుగా, పితృసమానుడుగా, అతణ్ణి దీవించవలసింది. అలా చేయకపోగా, క్రోధావేశంలో వినీలుణ్ణి శపించడం, దోషకారణమవుతుంది. అందువల్లనే, ఆయన శాపం ఫలించలేదు. వినీలుడు యీ సత్యాన్ని గమనించక, తానొక ధర్మ స్వరూపుడననీ, అందువల్లనే గురువు యిచ్చిన శాపం విఫలమైందనీ తలచాడు. దానితో అతడికి గురువు మీద ఏహ్య భావంతోపాటు, తాను గొప్పవాడిననే అహంభావం కలిగింది. అందువల్ల మధురంగా కవిత్వం చెప్పేశక్తిని కోల్పోయాడు. చివరకు నిజం గ్రహించి, జ్ఞానసాగరుడిని క్షమాపణకోరడం ద్వారా, తనలోని గర్వ, అహంభావాల నుంచి విముక్తుడు కాదలిచాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# అసలులోపం

ఒక లంచగొండి గ్రామాధికారి, ఎవరు ఎక్కువ డబ్బు లంచం యిస్తే, వాళ్ళకు అనుకూలంగా తీర్పు చెప్పేవాడు. అలా అతను తేరగా డబ్బు సంపాయిస్తూంటే, అతని ఏకైక సంతానం రకరకాల వ్యసనాలకు అలవాటు పడ్డాడు.

ఒక రోజు గ్రామాధికారి నిద్రిస్తూండగా, అతని కొడుకు తండ్రి చొక్కాజేబులో డబ్బు దొంగిలిస్తూ పట్టుబడ్డాడు.

గ్రామాధికారి అయిన తనింట్లో, తన జేబులో నుంచే డబ్బు, తన కొడుకే దొంగిలిస్తూండడం, ఆయనకు ఆశ్చర్యం కలిగించింది.

"ఇదే నేరానికి, ఒక గ్రామాధికారిగా నీకు ఏం శిక్ష విధిస్తానో తెలుసా?" అంటూ ఆయన కొడుకును గద్దించాడు.

"ఏవి నేరాలు తప్పించుకోడానికి, నీలాంటి గ్రామాధికారికి, ఎంతెంత లంచం ముట్టజెప్పాలో, నాకూ తెలుసు!" అంటూ, తండ్రి చేతిలో రెండు రూపాయిలు పెట్టి, ఆ కుర్రవాడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

అసలు లోపం తనలోనే వున్నదనీ, తన నీచప్రవర్తనవల్లనే, తన కుమారుడు అలా తయారయ్యాడనీ గ్రామాధికారి బుద్ధి తెచ్చుకుని, లంచాలు పట్టడం మానేశాడు.

—ఎం. డి. సౌజన్య.





కావ్యకథలు :

# శకుంతల-2

ధర్మప్రభువయిన దుష్యంతుడిపట్ల గౌరవాదరాలు గల కణ్వముని, జరిగిన విషయం తెలుసుకుని పరమానందం చెందాడు. శకుంతలను ఆశీర్వదించి, ఆమె రాజాంతఃపురానికి చేరుకున్న తరవాత నడుచుకోవలసిన తీరుతెన్నులను గురించి బోధచేశాడు!

ఒకనాడు కణ్వముని ఆశ్రమంలో లేడు. శకుంతల ఏకాంతంగా దుష్యంతుణ్ణి తలుచుకుంటూ కూర్చున్నది. ఆ సమయంలో దుర్వాసముని అక్కడికి వచ్చి, కణ్వమునిని గురించి అడిగాడు. పరధ్యానంగా ఉండడంవల్ల, శకుంతల దుర్వాసుడి రాకను గమనించలేదు. పరమకోపిష్ఠి అయిన దుర్వాసుడు ఆగ్రహం చెంది, "నువ్వు ఎవరిని తలుచుకుంటూ నన్ను ఉదాసీనం చేశావో వారు నిన్ను మరచిపోదురుగాక!" అని శపించాడు.





ముని శాపం కూడా శకుంతల చెవిని పడలేదు. కాని, ఆశ్రమవాసులయిన కొందరు మునికుమార్తెలు, ఆ శాపం విని హడలిపోయి, శకుంతల అపరాధాన్ని క్షమించమని దుర్వాసుణ్ణి వేడుకున్నారు. ఆయన మనసు కరిగి, శాపప్రభావం శాశ్వతం కాదని చెప్పి వెళ్ళిపోయాడు.



కొన్నాళ్ళు గడిచాక, కణ్వముని, శకుంతలను దుష్యంతుడి వద్దకు పంపే ఏర్పాట్లు చేశాడు. తన చిన్ననాటి స్నేహితులవద్ద సెలవు తీసుకుని, పెంచిన తండ్రికీ, పెద్దలకూ నమస్కరించి శకుంతల హస్తినాపురానికి బయలుదేరింది. కణ్వముని శిష్యుడయిన ఒక మునికుమారుడు ఆమె వెంట రక్షణగా బయలుదేరాడు.

పుట్టి పెరిగిన వాతావరణాన్నీ, అనురాగంతో పెంచి పెద్ద చేసిన కణ్వమునినీ వదిలి వెళ్ళడానికి ఒకవైపు బాధపడుతూ; మరోవైపు, చేరుకోనున్న తన భర్త సన్నిధిని తలుచుకుని ఆనందంగా కలలుకంటూ ప్రయాణమయింది శకుంతల. పడవప్రయాణం సుఖంగా సాగింది.





అమితోత్సాహంతో హస్తినాపురంలోని దుష్యంతుడి సభకు చేరిన శకుంతలను రాజు చూశాడు. కాని, ఏమీ పట్టించుకోలేదు. శకుంతల ఆశ్చర్యపడింది. ఆమె వెంట వచ్చిన మునికుమారుడు, దుష్యంతుడితో, "మహారాజా! ఈమె కణ్వముని పెంపుడుకూతురు శకుంతల!" అన్నాడు.

"అలాగా! నానుంచి ఏదైనా సహాయం కోరివచ్చారా!" అని అడిగాడు దుష్యంతుడు. ఆ మాట విని శకుంతల దిగ్భ్రాంతి చెందింది. మునికుమారుడు మళ్ళీ రాజుతో, "మహారాజా, మీరు శకుంతలను మరిచిపోయారా! కణ్వాశ్రమంలో ఆమెను మీరు వివాహమాడారు కదా!" అన్నాడు.





"భగవంతుడా! వీళ్ళెవరో నా మీద నింద మోపడానికి వచ్చారు!" అని దుష్యంతుడు బాధపడి, వాళ్లతో, "ఇటువంటి అపనిందమోపడానికి మీకెంత ధైర్యం! మర్యాదగా ఇక్కడి నుంచి వెళ్ళిపొండి; లేదా కఠినంగా శిక్షిస్తాను," అన్నాడు ఆగ్రహంతో.

వివాహ సమయంలో దుష్యంతుడు తనకు ఇచ్చిన ఉంగరాన్ని చూపినట్టయితే, ఆయనకు జ్ఞాపకం రాగలదని శకుంతల తన వేలి కేసి చూసింది. కాని, వేలిలో ఉంగరం లేదు. పడవలో ప్రయాణం చేస్తూ, నీళ్ళతో ఆడుకోవడంవల్ల, ఉంగరం కాస్త నదిలో పడిపోయి వుంటుందని ఆమె గ్రహించి బాధపడింది.





శకుంతల మౌనంగా మునికుమారుడితో పాటు రాజసభను వదలి వెళ్ళిపోయింది. దుర్వానముని శాపకారణంగా దుష్యంతుడు శకుంతలను పూర్తిగా మరిచిపోయాడు. కాని, రాజుకు ఆమెపట్ల ఆగ్రహంకన్నా విచారమే ఎక్కువ కలిగింది.

తనకుమార్తెకు వాటిల్లినభంగపాటునూ, వేదననూ గ్రహించిన మేనక స్వర్గం నుంచి భూలోకానికి దిగివచ్చి, శకుంతలను అనురాగంతో కౌగిలించుకున్నది. ఆమెను సురక్షితమైన ఒక ఆశ్రమానికి చేర్చింది.





అక్కడ శకుంతల ఒక అందమైన మగశిశువును ప్రసవించింది. శకుంతల తన బిడ్డకు భరతుడు అని నామకరణం చేసి, అల్లారుముద్దుగా పెంచసాగింది. అద్భుతమైన తెలివితేటలతో, సాటిలేని ధైర్యసాహసాలతో బాలభరతుడు అందరినీ మురిపించసాగాడు!

—(ముగింపు వచ్చే సంచికలో)



# స్వయంకృతం

చింతమోడు అనే గ్రామానికి సమీపాన గల, ఒక అడవిలో, అర్ధరాత్రివేళ ముసలి పిశాచం ఒకటి, దిరిశెనచెట్టు కొమ్మల్లో కునికిపాట్లు పడుతున్నది. ఉన్నట్టుండి చెట్టు కింద ఏదో అలికిడి కావడంతో, అది కళ్ళు తెరిచి చూసింది. యువకు డొకడు పొదల మధ్యగా దారి వెతుక్కుంటూ, చెట్టు కేసి వస్తున్నాడు.

పిశాచం నిద్రాభంగం కలిగినందుకు కోపగించుకుంటూ, "ఎవడ్రావాడు! పిశాచాలు కాస్త కునుకుతీసేవేళ, అడవిలో నీకేం పని? నాకు నిద్రాభంగం కలిగించి నందుకు, ప్రాణాలతో వదలను," అన్నది.

ఆ మాటలకు యువకుడేమీ చలించకుండా, "నాక్కావలసిందే అది! నా ప్రాణాలు నువ్వు కాకపోతే, ఏ క్రూర మృగమో తీస్తుంది. అందుకే, యింత చీకటిలో యిక్కడికి వచ్చాను," అన్నాడు.

ఆ జవాబు విన్న పిశాచానికి, అతడి మీద జాలికలిగింది. అది చెట్టు మీది నుంచి కిందికి దూకి, "నీ వయసు, నా వయసులో వెయ్యోవంతు కూడా వుండదు. అప్పుడే బతుకంటే విరక్తి పుట్టిందా? ఏం కథ!" అని అడిగింది.

యువకుడు, దానికి తనను గురించి చెప్పుకున్నాడు. వాడి పేరు మురారి. మనిషి చాలా అనాకారి. ఎదురింట్లో వుండే, విమల అనే చక్కని అమ్మాయిని మనస్ఫూర్తిగా ప్రేమించాడు.

విమలకు యీ మధ్య పెళ్ళి సంబంధాలు వస్తున్నాయని తెలిసి, ఆనాటి సాయంత్రం మురారి, వాళ్ళింటికి వెళ్ళాడు. ఆ సమయంలో విమల పెరట్లో పువ్వులు కోస్తున్నది.

మురారి, ఆమెను సమీపించి, "విమలా, నువ్వంటే నాకు ప్రాణం. నిన్ను

మాచిరాజు కామేశ్వరరావు



పెళ్ళి చేసుకుని, పువ్వుల్లోపెట్టి చూసుకుంటాను. నా మాట నమ్ము!'' అన్నాడు.

వాడి మాటలకు విమల నవ్వి, వాణ్ణి ఇంట్లోకి తీసుకుపోయి, ఒక నిలువుటద్దం ముందు నిలబెట్టి, ''అదేమిటి ?'' అని అడిగింది.

''అద్దం,'' అన్నాడు మురారి.

''అందులో ఎన్నడైనా ముఖం చూసుకున్నావా ? నా అందానికి, నీ అనాకారి రూపం తగింది కాదన్న ఆలోచన కలగ లేదా ? ఇక వచ్చినదారినే వెళ్ళు,'' అన్నది విమల కోపంగా.

మురారి అవమానభారంతో కుంగిపోతూ, యిక బతుకు వృథా అనుకుని అడవికేసి బయలుదేరాడు. అక్కడ ఏ క్రూరమృగం వాతో పడాలని అతడు నిశ్చయించుకున్నాడు.

అంతా విన్న పిశాచి పెద్దగా నవ్వి, ''నిరాశపడకు ! నిన్ను, విమల కన్న పదిరెట్లు అందగాడినిగా చేస్తాను,'' అంటూ నోట్లో నుంచి గుప్పుమని మంటలు తెప్పించి, మురారి ఒళ్ళంతా కాల్చింది.

మురారి బాధతో విలవిలలాడిపోయాడు. వెంటనే పిశాచం వాడి మీదికి మంచుకంటే చల్లనైన గాలులు ఊదింది. వెన్నెల వెలుగులో మురారి, తన ఒంటి నలుపు విరిగి, పచ్చని పసిమిచాయ వచ్చినట్టు గమనించి, పిశాచానికి వంగి నమస్కారం చేసి, పరమానందంతో ఇంటిదారి పట్టాడు.

అయితే, మర్నాడు అర్ధరాత్రి వేళ, దిగులుగా అడుగులో అడుగు వేసుకుంటూ మురారి పిశాచం వున్న చెట్టు దగ్గిరకు వచ్చాడు.

పిశాచం వాణ్ణి చూసి, ''కాస్త కంటికి కునుకుపట్టబోయే సమయానికి వచ్చావు. ఏం జరిగింది ?'' అంటూ చెట్టు దిగి వచ్చి, వాడి ముఖం చూసి, ''అదేం, అలా వున్నావు ?'' అని అడిగింది.

''అందంతో కడుపునిండదు. ఐశ్వర్యం కోరుకునిరా !'' అన్నది విమల, అన్నాడు మురారి విచారంగా.

"అంటే, నా సంగతి విమలకు చెప్పా వన్న మాట, అవునా?" అని అడిగింది పిశాచి.

"చెప్పకుండా ఎలా దాయడం! విమల దగ్గిర, నాకు దాపరికాలంటూ ఏమీ లేవు." అన్నాడు మురారి.

"అలాగా! అయితే, ఆ ఐశ్వర్యమేదో యిప్పుడే యిస్తాను. తీసుకుపోయి విమలను సంతోషపెట్టి పెళ్ళాడు," అంటూ పిశాచి చెట్టుమీదికిపోయి, ఒక పెద్ద సంచినిండు బంగారు కాసులను కిందపడవేసింది.

మురారి, ఆ సంచీతీసుకుని, పిశాచానికి కృతజ్ఞత చెప్పుకుని, గ్రామానికి బయలు దేరాడు.

మూడోనాటి రాత్రి దిగులుపడుతూ వస్తున్న మురారిని, పిశాచి అంత దూరం లోనే చూసి, "ఒరే, బాబూ! విమలతో నీ పెళ్ళిమాట ఏమోగాని, ఈ వయసులో నాకు రాత్రిళ్ళు సరిగా నిద్రలేకుండా చేస్తున్నావు మళ్ళీ ఏం ముంచుకొచ్చింది? విమలకు, ఆ బంగారం చాలదా?" అని అడిగింది.

మురారి చెట్టుకింద చతికిలబడి కూర్చుంటూ, "విమల అన్నదేమిటో తెలుసా? అందం, ఐశ్వర్యంవుంటే సరిపోతుందా, వాటిని శాశ్వతంగా భద్ర పరుచుకోగల తెలివితేటలు కూడా కావాలి. అవి నీదగ్గిర లేవు. వెళ్ళి, పిశాచాన్ని అడుగు అన్నది," అని చెప్పాడు.



''పాపం, ఆ విమల చాలా తెలివి తక్కువది!'' అంటూ పిశాచం పెద్దగా నవ్వి, చెట్టుమీదికిపోయి, కొమ్మలను గట్టిగా గలగలమంటూ వూపింది.

ఒకటి, రెండు క్షణాలు గడిచేలోపల మురారి చెట్ల ఆకులతో కప్పుకుపోయాడు. వాడు వాటిని దులుపుకుంటూ లేచి నిలబడ, పిశాచంతో, ''నీ మేలు జన్మలో మరవను. ఇక వచ్చి నీకు నిద్రాభంగం కలిగించనులే,'' అంటూ ఇంటిదారి పట్టాడు.

నాలుగోరోజు రాత్రి, చెట్టుకేసి వస్తున్న మనిషిని చూస్తూనే పిశాచం, ''రా విమలా, రా! నువ్వు వస్తావని నాకు ముందే తెలుసు,'' అన్నది.

విమల కళ్ళ నీళ్ళతో, ''నువ్వు ఏం మత్తుమందు చల్లావో కానీ, మురారి పూర్తిగా మారిపోయాడు. ఈ పగలు నన్ను పలకరించకపోగా, నా ముఖంకేసే చూడ లేదు. రేపు పట్నం వెళ్ళి, అక్కడ ఏదో వ్యాపారం ప్రారంభిస్తానని, వాళ్ళ వీళ్ళతో అంటున్నాడు. ఎలాగైనా నువ్వు, మురారికి బుద్ధి చెప్పి, మా పెళ్ళి జరిగేలా చూడాలి,'' అంటూ చేతులు జోడించింది.

పిశాచం పకపకమంటూ నవ్వి, ''ఇప్పటి మురారి, మునుపటి మురారి కాదు విమలా! తనకేది మేలో, ఏది కీడో తెలుసుకోగల తెలివిమంతుడు. అందం, ఐశ్వర్యం, తెలివితేటలూ పుష్కలంగా వున్న తనకు, నువ్వు తగిన భార్యవు కాదని గ్రహించి వుంటాడు. నీకంటే అందగత్తె, ఐశ్వర్యవంతురాలైన అమ్మాయే, అతణ్ణి పెళ్ళాడేందుకు యిష్టపడవచ్చు. నువ్వంటే ఎంతో ప్రేమానురాగాలున్న అతణ్ణి, నువ్వు అవమానించావు. అన్నీ వున్న మురారి, యిప్పుడు నిన్ను పెళ్ళాడ దలచకపోవడంలో ఆశ్చర్యపడవలసిం దేమీ లేదు. అంతా నీ స్వయంకృతం! అవునా?'' అని అడిగింది.

పిశాచి మాటల్లోని నిజాన్ని గుర్తించిన విమల, తలదించుకుని తిరుగుదారి పట్టింది.





# కృష్ణావతారం

కృష్ణుడు కాళియుడి మడుగులోకి దూకగానే, పాలసముద్రంలో మందరపర్వతం పడినట్టుగా, మడుగులోని నీరు అల్లకల్లోలమై, దాని అలజడి రసాతలం దాకా దిగింది. కాళియుడికి కోపం వచ్చింది. వాడు తన ఐదుపడగలూ విప్పి, కోరలు కనిపించే లాగా నోళ్ళు తెరిచి, నోట విషజ్వాలలు కక్కుతూ, మెలికలు తిరిగే తన శరీరాన్ని నది నిండా పరిచి, కృష్ణుణ్ణి అక్కడక్కడా కాట్లు వేసి, అతని శరీరమంతా చుట్టి, నొక్కసాగాడు. కృష్ణుడు మూర్ఛపోయాడు. అది చూసి కాళియుడి చుట్టాలూ, భార్యలూ, పిల్లలూ అయిన మహాసర్పాలన్నీ మూగి, మంటలు కక్కుతూ కృష్ణుణ్ణి కరిచారు.

ఇదంతా చూస్తున్న గోపకుమారులు బెదిరిపోయి, దక్షిణంగా కోసెడుదూరంలో ఉన్న వ్రేపల్లెకు పరిగెత్తి, అక్కడి వాళ్ళతో, ''నందగోపుడి కొడుకు కృష్ణుడు, ఆడుతూ ఆడుతూ ఉన్న వాడు కాస్తా ఎవరితోనూ చెప్పకుండా, నదిలో పెద్ద పాములుండే మడుగులోకి హఠాత్తుగా దూకేశాడు. అన్నిటికన్నా పెద్ద పాము పైనుంచి కిందికి కాలూ చెయ్యీ ఆడకుండా అతన్ని చుట్టేసింది. మడుగులోని పాములన్నీ అతన్ని చుట్టుముట్టి విపరీతంగా కరిచేస్తున్నాయి. పాపం, వాళ్ళ నాన్న ఎక్కడున్నాడో చెప్పండి. అందరూ వచ్చి కృష్ణుణ్ణి విడిపించే ఉపాయం చూడండి,'' అన్నారు.

7. కాళియమర్దనం



ఈ వార్త విన్నవాళ్ళకు పిడుగు పడ్డట్టయింది. నందుడికి ఆశ్చర్యమూ, దుఃఖమూ ముంచుకొచ్చాయి. "ఎక్కడ? ఎక్కడ?" అంటూ ఆయన వార్త చెప్పిన వాళ్ళ వెంబడి బయలుదేరాడు. బలవంతులైన గోపకు లందరూ చేతుల్లో ఆయుధాలు పట్టుకుని ఆయనకన్న ముందే పరిగెత్తారు. యశోదకు మూర్ఛ వచ్చినంత పని అయింది. ఆమె పెద్ద పెట్టున ఏడుస్తూ, విడిపోయిన జుట్టుముడితో, మిగతా గోప స్త్రీలు పట్టుకుని నడిపిస్తూంటే మడుగు దగ్గిరికి బయలుదేరింది.

మొత్తానికి ఊరుకు ఊరంతా కదిలింది. "ఏం ప్రారబ్ధం వచ్చి పడిందర్రా!" అన్నారు కొందరు. "కృష్ణు డెప్పుడూ ఏదో ఒకటి తెచ్చిపెట్టుకుంటాడు. చిన్నవాడు చిన్నవాడి పనులు చెయ్యడు," అన్నారు మరి కొందరు. "ఇంతకంటె పెద్ద గండాలే గడిచాడు. కాళియుడికి మూడిం దనుకో వలిసిందే. కృష్ణుడి కెలాటి భంగపాటూ రాదు, చూస్తూ ఉండండి," అన్నారు ఇంకా కొందరు.

అందరూ కాళిందీతీరాన నిలిచి కృష్ణుణ్ణి చూసి నీరుకారి పోయారు. అతను పాము చుట్టల్లో చిక్కుకుని చాలా దీనస్థితిలో ఉన్నాడు. ఎవరుగాని చేయగలిగిన దేమీ కనిపించలేదు. నందుడూ, యశోదా మూర్ఛపోయారు. మిగిలినవాళ్ళు వాళ్లకు శైత్యోపచారాలు చేసి స్పృహతెప్పించారు.

నందుడు మిగిలినవాళ్ళతో, "ఏం మహాపాతకం చేసుకున్నానో ఏమో, నా బిడ్డ ఇలా పాము వాతపడ్డాడు. నేను మహా పుణ్యాత్ముణ్ణనీ, అందుకే ఇంత అందమూ, బలపరాక్రమాలూ గల కొడుకును కన్నాననీ అందరూ నన్ను మెచ్చుకుంటే దేవుడి కళ్ళు కుట్టాయి. పూతన మొదలైన వాళ్ళందరినీ చంపినవాడు ఈ పాముువాతపడి ఎలాగైనా బయట పడక పోతాడా అన్న ఆశ కూడా ఒక చెంప పుట్టుతూనే ఉన్నది. మేము ఎలాగైనా ధైర్యం చిక్కబట్టుకోగలం. కాని కొడుకు

దుస్థితి చూసి తల్లడిల్లే తల్లి దుఃఖం ఎలా పోగొట్టేటట్టు ?'' అన్నాడు.

అప్పుడు యశోద కృష్ణుడితో, "నాయనా, నువు వెన్న తిన్నందుకు గోపికలు పితూరీ చేస్తే వాళ్ళను సముదాయించటానికి నిన్ను రోటికి కట్టాను. అందుకుగాను ఇవాళ నన్నీ విధంగా బాధిస్తున్నావా ? ఎంతో బలం గలవాడివి, నిన్నీ పాము ఏం చెయ్యగలదురా, బాబూ ? నేనంటే నీకిష్టం కాదూ ? ఒక్కసారి నాకేసి చూసి నవ్వవూ ? కళ్ళు తెరిచి చూడవూ ? అడవిలో గోవులు దిక్కులేక ఎలా చెల్లా చెదరయాయో చూడు. వెంటనే వచ్చెయ్యి, నాయనా. విషవృక్షాలు గల అరణ్యాన్ని ధ్వంసం చేసిన నీకీ పామొక లెక్కా ?'' అంటూ ఏడ్చింది.



అందరికీ దుఃఖం ముంచుకొచ్చింది. యశోదకు పుత్రనష్టం కలిగినట్టే భావించి తలా ఒక మాటా అన్నారు. కొందరు గోపకులు, ''మనమంతా మడుగులోకి దూకి ఆ పాముతో యుద్ధం చేద్దాం. కృష్ణుణ్ణి విడిపిద్దాం. లేకపోతే ఆ కాళియుడి విషాగ్నిలో చచ్చిపోదాం. కృష్ణుడులేకుండా వ్రేపల్లె కెలా తిరిగిపోతాం ?'' అన్నారు.

బలరాముడు అంతా చూస్తున్నాడు, అందరి మాటలూ వింటున్నాడు. అతను కృష్ణుడితో చివరి కిలా అన్నాడు: ''కృష్ణా, మానవ స్వభావం చాటు చేసుకుని, లోక హితం మాట మరిచిపోయి, ఈ వెధవ పాముకు చిక్కి, అసహాయుడివైపోయా వేమిటి ? నీ వాళ్ళందరూ ఎంత దైన్యంలో ఉన్నారో గమనించావా ? ఆ విషపు పురుగును శిక్షించి అందరినీ సంతోషపెట్టు,'' అన్నాడు.

ఈ మాట వింటూనే స్పృహ తెచ్చుకుని కృష్ణుడు కాళియుడి చుట్టలను ఒక్క తోపు తోసి, గాలిలోకి ఎగిరి బరువుగా పడగల మీదికి దూకాడు. అతను కాళియుడి తోక చేతిలోకి తీసుకుని, వాడి శిరస్సులను కాళ్ళతో మర్దన చేయసాగాడు. యమునలోని అలలు తాళం



వేస్తూండగా, తీరాన వున్న గోపకుల హర్ష ధ్వానాలు సంగీతంగా చేసుకుని, కాళియుడి తలలపై కృష్ణుడు చేసే మహా దారుణమైన నాట్యాన్ని ఆకాశం నుంచి దేవతలు చూశారు.

కాళియుడి తలలు చితికాయి. వాడి ముక్కుల రక్తధారలు కారాయి. వాడి కోరలు విరిగి, నోట మంటలతో కూడిన విషం వెలువడింది. వాడు వడిలిపోయిన తామరకాడలాగా అయిపోయి, చచ్చే స్థితికి వచ్చాడు. ఆ స్థితిలో వాడు హీన స్వరంతో, "దేవా, నువ్వు సర్వేశ్వరుడవని తెలీక, తుచ్ఛమైన కోపంతో, నీ పవిత్రమైన దేహాన్ని ఇలా చేశాను. నా మదానికి తగినట్టు శిక్షించావు. ఇక నన్ను కరుణించి, క్షమించు. నా విషమంతా దిగిపోయింది. బుద్ధి వచ్చింది. నీకు దాసుడుగా ఉండి ఏం చెయ్యమంటే అది చేస్తాను. నీ పాదాలు తాకి నేను పవిత్రుణ్ణి కావటం చేత, నీ ఆగ్రహం నాకు అనుగ్రహమే అయింది," అన్నాడు వినయంగా.

కృష్ణుడికి కాళియుడి పైన జాలికలిగి, "ఇక నుంచీ నీవు ఈ యమునానదిలో ఉండటానికి వీలులేదు. నీ వారందరినీ వెంటబెట్టుకుని సముద్రంలోకి వెళ్ళిపో. నీ విషంతో పాడైపోయిన నీరంతా పోయి, నది ఇక శుద్ధంగా ఉంటుంది; జనానికి ఉపయోగపడుతుంది. నీ తలల మీద నా కాలి గుర్తులు చూసి గరుత్మంతుడు నీ జోలికి రాడు. ఇది నేను నీ కిచ్చే వరం," అన్నాడు.

కాళియుడు తన పరివారంతో సహా అప్పుడే సముద్రం కేసి ప్రయాణమయాడు. కృష్ణుడు నదిలో నుంచి ఒడ్డుకు వచ్చాడు. తల్లిదండ్రులు అతన్ని కౌగలించుకుని దీవించారు. అతను వాళ్ళకు నమస్కరించాడు. మిగిలిన గోపకులంతా అతని చుట్టూ మూగి, తెగ ప్రశంసించుతూ, అద్భుతాశ్చర్యాలు ప్రకటించారు.

గోపకులలో ముఖ్యులైన వారందరికీ ఆ సమయంలో కృష్ణుడొక దేవుడు లాగే



కనబడ్డాడు. "ఇంత బలమూ, ధైర్యమూ, సాహసమూ ఎక్కడా ఎవరికీ ఉండవు. నీ మహిమ జగత్తంతా కొనియాడ దగినది. మా మందలకూ, మాకూ నీవే రక్షకుడవు. నీ దయవల్ల ఇక గోవులు ఎక్కడ బడితే అక్కడ యథేచ్ఛగా సంచరించగలవు. ఈ నదిలో దిగే మునులకు ఎలాటి అపాయమూ ఉండదు. నీ సంగతి ఇంత కాలమూ మేము గ్రహించలేకపోయాం." అంటూ వారు అతనికి భక్తితో ప్రదక్షిణ చేశారు.

అతను అందరినీ తగిన విధంగా పరామర్శించి, వారందరితోను వ్రేపల్లెకు తిరిగి వచ్చి, ఎప్పటిలాగే సుఖంగా జీవితం గడపసాగాడు.

కొంతకాలం గడిచింది. పశువులకు మేత లేకుండా పోయింది. కృష్ణుడు మిగిలిన గోపకులతో కర్తవ్యం ఆలోచించాడు. అప్పుడు వారిలో పెద్దవాళ్ళు ఒక విషయం కృష్ణుడికి చెప్పారు.

గోవర్ధన పర్వతానికి ఉత్తరంగా, కాళిందీ నదికి దగ్గరలోనే అతి విశాలమైన తాటితోపు ఉన్నది. అందులో పచ్చిగడ్డి పుష్కలంగా ఉన్నది. అయితే అందులో ధేనుకుడనే రాక్షసుడు గాడిద రూపంలో ఉండటంచేత్త అందులోకి ఏ ప్రాణీ ప్రవేశించదు.

ఈ విషయం చెవుల పడేసరికి బలరామ కృష్ణులకు ఉత్సాహం పుట్టుకొచ్చింది. వాళ్ళు ధైర్యం గల గోపకులతో, "పశువులకు మేత వుండాలి గాని, రాక్షసులకు భయపడతామా? పదండి!" అన్నారు. వాళ్ళంతాగోవులను తోలుకునితాటితోపుకు బయలుదేరి వెళ్ళారు. అందులో ఎటు చూసినా నవనవలాడుతూ బోలెడంత పచ్చిక, పశువులు ఆత్రంగా దాన్ని మేయనారంభించాయి. కృష్ణుడు మొదలైన గోపకులు పరమానందంతో ఆ గడ్డిలో విహరించారు.

కృష్ణుడా తోపు అందం చూసి ఆనందించాడు. తాటిచెట్లు పాతాళంలో నుంచి



పైకి వచ్చి, నల్లటి శరీరాలతోనూ, పడగల లాటి తలలతోనూ ఆడుతున్న పాముల్లాగా ఉన్నాయి. వాటి మీద ఉన్న తాటిపళ్ళు ఎరుపూ, నలుపూ కలిసిన రంగు కలిగి వుండి, మంచి వాసన కొడుతున్నాయి. కృష్ణుడు బలరాముడితో, "అన్నా, నువు చెట్లెక్కి పళ్ళు పడెయ్యి. నా కా పళ్ళు తినాలని ఉన్నది. ఆవులకు కూడా పెడదాం," అన్నాడు.

"ఎక్కటంచాలా ఆలస్యమవుతుందిలే. నేను చెట్ల మొదళ్ళు పట్టుకుని ఊపు తాను, రాలిన పళ్ళను అందరూ ఏరు కోండి," అని బలరాముడు గోపకులందరి తోనూ చెప్పి, ఒక్కొక్క చెట్టునే మొదలు పట్టుకుని అవలీలగా ఊపసాగాడు. తపతపా మోతచేస్తూ తాటిపళ్ళు రాల నారంభించాయి.

ఈ ధ్వని ధేనుకాసురుడి చెవినిపడింది. గాడిద ఆకారంలో ఉండే ఆ భయంకర రాక్షసుడు, తన లాటి ఆకారాలలోనే ఉన్న వెయ్యిమంది అనుచరులు వెంట రాగా బలరామకృష్ణులున్న చోటికి వచ్చాడు. వాణ్ణి చూసి గోపకులంతా హడలిపోయారు.

ఇలా గాడిదలన్నీ వస్తుంటే దుమ్ము ఆకాశంలోకి లేచి మబ్బులాగా అయింది. అవి ఓంద్ర పెడుతుంటే దిక్కులు పిక్కటిల్లాయి. అలా వచ్చే గాడిదల మందకు ముందు నడిచే ధేనుకాసురుడికి ఎదురుగా, ఉత్తచేతులతో బలరాముడు నిలబడ్డాడు. ధేనుకుడు బలరాముడికి దగ్గిరగా వస్తూనే, వెనక్కు తిరిగి, వెనక కాళ్ళు రెండూ ఎత్తి, బలంగా బలరాముడి గుండెలమీద తన్నాడు. బలరాముడు ఒడుపుగా ఆ కాళ్ళు రెండూ పట్టుకుని ధేనుకుణ్ణి విసిరి పైకి ఎగరవేశాడు. ధేనుకుడి శరీరం తాటిచెట్లకు తగిలి నుగ్గునుగ్గయింది. ఆ శరీరంతో బాటు తాటిపళ్ళు కూడా చాలా రాలాయి.

బలరాముడు అంతటితో పోనీక మిగిలిన రాకాసిగాడిదలను కూడా వెనక

కాళ్ళు పట్టుకుని, తాటిచెట్ల కేసి కొట్టి చంపాడు. అతనితోబాటు కృష్ణుడు కూడా ఆ రాక్షసులను చంపాడు. మొత్తం తాటి తోపంతా తాటిపళ్ళతోనూ, రాక్షసుల కళేబరాలతోనూ నిండిపోయింది. గోపకులు ఆ ఇద్దరి పౌరుషాన్ని మెచ్చుకున్నారు. రాక్షసులు చావటంతో ఆ తాటితోపు, నిరపాయమయింది.

మరొకసారి గోపకులు భాండీరవట ప్రాంతంలో ఆవులను మేపుతూ ఆటలలో మునిగి ఉండగా, ప్రలంబుడనే రాక్షసుడు ఒక గోపకుడి రూపంలో వారితో చేరాడు. గోపబాలకు లందరూ హరిణక్రీడన మనే ఆట ఆడదలచి జంటలు జంటలుగా చీలారు. కృష్ణుడూ, అతని బావమరిది శ్రీధాముడూ ఒక జంటగా అయారు. ప్రలంబుడు బలరాముడికి జంట అయ్యాడు. ఆ విధంగా సగంమంది కృష్ణుడి పక్షమూ, సగంమంది శ్రీధాముడి పక్షమూ అయ్యారు. ఆట ఏమిటంటే భాండీర వటవృక్షం హద్దుగా పెట్టుకుని జింక లాగా దూకుతూ పరిగెత్తాలి. ఈ ఆటలో కృష్ణుడి పక్షంవాళ్ళు గెలిచారు. శ్రీధాముడి పక్షంవాళ్ళు ఓడారు. ఓడిన వాళ్ళు గెలిచినవాళ్ళను మూపు మీద ఎక్కించుకుని హద్దుదాకా మోసుకు పోవాలి.

అందుచేత ప్రలంబుడు బలరాముణ్ణి మూపు మీద ఎక్కించుకుని, ఎటో తీసుకు పోయి, అకస్మాత్తుగా తన రాక్షసాకారం ధరించి, ఆకాశంలోకి లేచాడు. బలరాముడు ఆశ్చర్యపడి, ఆ క్షణంలో ఏం చెయ్యాలో తోచక, కృష్ణుణ్ణి కేకపెట్టి తన స్థితి చెప్పాడు. ''వాడి అంతు తేల్చక చూస్తావేం?' అని కృష్ణుడు హెచ్చరించాడు.

వెంటనే బలరాముడు పిడికిలి బిగించి, రాక్షసుడి నెత్తిన ఒక్కటి పెట్టాడు. మరుక్షణమే రాక్షసుడు, తల పగిలి, నేలకూలి చచ్చాడు. ప్రలంబుణ్ణి చంపాక బలరాముడికి బలదేవుడనే పేరు వచ్చింది.






నీలయ్య అనేవాడు, ఎంత కష్టపడినా కలిసిరావడం లేదు. ఒక భాగ్యవంతుడు, సమయానికి వాడి కిస్తానన్న డబ్బివ్వక మోసం చేశాడు. మరొక భాగ్యవంతుడు డబ్బిస్తే, ఉన్నట్టుండి నీలయ్య భార్యకు ఏదో పెద్ద జబ్బు చేసింది. ఆ డబ్బంతా వైద్యానికి ఖర్చయిపోయింది. ఒకసారి ఇంట్లో దొంగలుపడ్డారు. ఇంకొకసారి హఠాత్తుగా చుట్టాలదండు వచ్చిపడి నెల రోజులు తిష్ఠ వేశారు. కొన్నాళ్లపాటు ఎంత ప్రయత్నించినా వాడికి ఎక్కడా పనే దొరకలేదు.

ఇలా చాలాకాలంగా జరుగుతూండడం వల్ల, నీలయ్య తీరని అప్పులపాలై పోయాడు. ఎప్పుడైనా అనుకున్నదానికన్న నాలుగు డబ్బు లెక్కువ దొరికినా, అది వాడి అప్పుల మీది వడ్డీ తీర్చడానికే చాలేది కాదు.

ఈ పరిస్థితుల్లో నీలయ్యకు జీవితమంటే చెప్పరానంత విరక్తి పుట్టింది. ఒక రోజున వాడు, భార్యకు చెప్పకుండా ఇంట్లోంచి బయల్దేరాడు. ఊరి చివర వున్న నదిలో దూకి చావాలని, వాడనుకున్నాడు.

దారిలో వాడికి, ఒక సన్యాసి ఎదురయ్యాడు. సన్యాసి నీలయ్యను చూస్తూనే, ''చాలా దూరం నుంచి వస్తున్నాను. కాసేపు నా పాదాలొత్తకూడదా—నువ్వు కోరినదిస్తాను,'' అన్నాడు.

నీలయ్యకు, సన్యాసులంటే భక్తి, గౌరవం అందువల్ల, వాడు సన్యాసికి సేవ చేశాకే చావాలనుకుని, ''స్వామీ, నేను తమ పాదసేవ చేసుకుంటాను. తమరి నుంచి, నేనేమీ కోరను,'' అన్నాడు.

సన్యాసి దారిపక్కన వున్న, ఒక చెట్టు కింద విశ్రమించాడు. నీలయ్య, ఆయనకు కొంతసేపు పాదసేవ చేశాడు. సన్యాసి

"వసుంధర"



తృప్తిచెంది. "ఏదైనా కోరుకో, యిస్తాను." అన్నాడు.

"స్వామీ, కాసేపట్లో చావబోతున్న వాణ్ణి. నాకేం కోరికలుంటాయి?" అన్నాడు నీలయ్య.

సన్యాసి, వాడి కథ అడిగి తెలుసుకుని, "ఈ మాత్రానికే చావడమెందుకు? నీ దారిద్ర్యం నేను పోగొడతాను. ఇది తీసుకో!" అంటూ జోలెలోంచి కొంత బూడిద తీసి యిచ్చాడు.

"స్వామీ, గొప్పవాళ్ళు నాకిచ్చిన డబ్బే, నా దరిద్రం పోగొట్టలేదు. ఈ బూడిద నేనేం చేసుకోను?" అన్నాడు నీలయ్య నిరుత్సాహంగా.

సన్యాసి నవ్వి, "నీకు లక్ష్మీకటాక్షం లేదు. అందువల్లనే, నీ దగ్గిర డబ్బు నిలవడం లేదు. లక్ష్మీదేవి పటానికి పది రోజులపాటు, యీ బూడిదతో పూజ చెయ్యి. నీ కష్టాలు తొలిగిపోతాయి." అన్నాడు.

నీలయ్యకు ఆనందంతోపాటు, ఒక సందేహం కలిగింది. సన్యాసి యిచ్చిన బూడిద గుప్పెడు మాత్రమే. దానితో పది రోజులపాటు పూజచేయడమెలా? మొదటి రోజుకే బూడిద అయిపోతుంది.

వాడి సందేహం విని, సన్యాసి చిరునవ్వు నవ్వి, "నేనిచ్చినది మామూలు బూడిద కాదు, చాలా పవిత్రమైనది; ఎంతో మహిమ గలది. ఇది పూజకు ఎంత వాడినా తరక్కుండా అక్షయమవుతుంది. ఎవరైనా పేదరికంతో బాధపడుతుంటే, వాళ్ళకూ యీ బూడిద యిచ్చి సాయపడు. కాని, ఒక్క విషయం గుర్తుంచుకో! అవసరం లేకుండా, అత్యాశకొద్దీ, యీ బూడిదను పూజకు ఉపయోగించే వాళ్లకు మాత్రం, ఉన్నదంతాపోయి, యీ బూడిదే మిగులుతుంది." అన్నాడు.

నీలయ్య సన్యాసికి నమస్కరించి, బూడిద తీసుకుని పరమానందంతో ఇంటికి వెళ్ళి జరిగింది భార్యకు చెప్పాడు. వాడి భార్య ఎంతో సంతోషించి, ఆ బూడిదను

రాగిపాత్రలో దాచింది. అయితే, పూజకు వాడింట్లో లక్ష్మీదేవిపటం లేదు. ఎదురింట్లో, ఒక భాగ్యవంతుడున్నాడు. పటం కోసం, నీలయ్య ఆయన ఇంటికి వెళ్ళాడు.

భాగ్యవంతుడు, నీలయ్యను కారణం అడిగి తెలుసుకుని, ఇంట్లోంచి లక్ష్మీదేవి పటం తెచ్చి, "ఏడాదిక్రితం, యీ పటానికి అద్దం బద్దలైపోయింది. నువ్విప్పుడు బూడిదతో పూజచేస్తే, పటం మీది బొమ్మ పాడైపోతుందని నా భయం. అలా జరిగితే మాత్రం, నువ్వు నాకు కొత్తపటాన్నివ్వాలి," అన్నాడు.

నీలయ్య అందుకు ఒప్పుకుని, పటం తీసుకుని యింటికి వెళ్ళాడు. వాడి భార్య జరిగింది విని, "మనకు మళ్ళీ యిలాంటి పటం దొరకక్కపోవచ్చు. అదీకాక, యింత అందమైన బొమ్మను బూడిదతో పాడు చేయడం, నా కిష్టం లేదు. దీనికి అద్దం కట్టిద్దాం," అన్నది.

నీలయ్య, పటాన్ని తీసుకుని అద్దాలు కట్టేవాడి దగ్గరకు వెళ్ళాడు. వాడు నీలయ్యతో, "నాకొక వరహా యివ్వు, లేదా నా ఇంట్లో పది రోజులపాటు వరసగా పని చెయ్యి. అప్పుడే అద్దం కడతాను," అన్నాడు.

డబ్బు లేని కారణంగా నీలయ్య, వాడింట్లో పని చేయడానికి ఒప్పుకున్నాడు. అద్దాలుకట్టే అతను, వాడి చేత ఐదు రోజులు పని చేయించుకుని, "ప్రస్తుతానికి,





నా ఇంట్లో పని లేదు. రెండు రోజులాగి, మళ్ళీ రా," అన్నాడు.

రెండు రోజుల తర్వాత నీలయ్య, అతనింటికి వెళ్ళాడు.

అద్దాలు కట్టేవాడు, వాడిని చూసి నవ్వి, "గుర్తుంచుకో! నువ్వు వరసగా పది రోజులు పని చేయాలని ఒప్పందం. అయితే, ఐదు రోజులు చేశాక, రెండు రోజులు పని చేయలేదు కాబట్టి, మళ్ళీ యీ రోజు నుంచి వరసగా పది రోజులు పని చేయాలి. అప్పుడే, నీ పటానికి అద్దం కడతాను," అన్నాడు.

ఇది విని, చాలా అన్యాయమంటూ గోలకెత్తాడు నీలయ్య.

"ఇందులో అన్యాయమేముంది? ఒప్పందం, ఒప్పందమే!" అన్నాడు అద్దాలు కట్టేవాడు.

అతడి దగ్గిర కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం పని పూర్తి చేయడం, యీ జన్మకు సాధ్యపడదని, నీలయ్యకు అర్థమైపోయింది.

నీలయ్య వరహా కోసం మరొకడి దగ్గిరకు వెళ్ళాడు.

"మా ఇంటి పెరట్లో పాముల పుట్ట వున్నది. అందులో తాచుపాములున్నాయి. నువ్వాపుట్టను నేలమట్టం చేసి, ఆపాముల్ని చంపితే, ఒక వరహా యిస్తాను," అన్నాడు ఇంటివాడు.

"ఆ పని నావల్ల ఎలా అవుతుంది? పాములవాణ్ణి పిలవండి!" అన్నాడు నీలయ్య.

"అయితే, ఆ వరహా పాములవాడికే యిస్తాను. నీ కెందు కివ్వాలి?" అన్నాడు ఇంటివాడు.

"ఇది చాలా అన్యాయం!" అన్నాడు నీలయ్య దిగులుగా.

అందుకు ఇంటివాడు, "నీ ఎదురింటి భాగ్యవంతుడే, ఏడాది నుంచి, ఒక వరహా యిచ్చి, ఆ పటానికి అద్దం కట్టించలేకపోయాడు. నేనంత ధనవంతుణ్ణి కాదు; పేదవాణ్ణి. ఊరికే వరహా ఎక్కణ్ణించి

తేగలను ?'' అని ప్రశ్నించాడు చాలా కటువుగా.

ఇక చేసేదిలేక నీలయ్య, వడ్డీవ్యాపారి పాపయ్య దగ్గిరకు వెళ్ళాడు.

ఈ పాపయ్య పరమకర్కోటకుడు. అతడు నీలయ్య చెప్పిందివిని, ''నేనిప్పుడే నీకు వరహా యిచ్చి సాయపడతాను. అయితే, నెల రోజుల్లోగా నువ్వు బాకీ తీర్చాలి. వడ్డీగా వరహాకు, మరొక వరహా యివ్వాలి. అలా చేయకపోతే నువ్వూ, నీ భార్యా యావజ్జీవితం, నా ఇంట్లో బానిసలై పడివుండాలి,'' అన్నాడు.

ఈ షరతు దారుణమనిపించింది, నీలయ్యకు. వాడు ఇంటికి వెళ్ళి, విషయం భార్యకు చెప్పాడు.

ఆమె వెంటనే, ''మనను మనుషులు రక్షించరని ఋజువైపోయింది. దేవుణ్ణే నమ్ముకుందాం. సన్యాసి మాటలు నిజమైతే, పది రోజుల్లో మన దరిద్రం తీరిపోవాలి. వెళ్ళు, పాపయ్య షరతుకు ఒప్పుకో !'' అని భర్తకు ధైర్యం చెప్పింది.

నీలయ్య, పాపయ్య దగ్గిర వరహా తీసుకుని, అద్దాలు కట్టేవాడి కిచ్చాడు. వాడు వెంటనే పటానికి అద్దం కట్టి యిచ్చాడు. నీలయ్య, సన్యాసి యిచ్చిన బూడిదతో, పది రోజులపాటు, ఆ పటానికి పూజ చేశాడు. పూజ పూర్తయిన రోజు సాయంత్రం, వాడు పెరట్లో మొక్కలకు పాదులు తవ్వుతుండగా, గునపానికి ఏదో తగిలి ఖంగుమన్న శబ్దమైంది. తవ్వి చూస్తే, అక్కడ రెండు



లంకెలబిందెలు దొరికాయి. వాటి నిండా బంగారు కాసులున్నాయి.

దానితో నీలయ్య దారిద్ర్యం తీరి పోయింది. వాడు, పాపయ్యతో సహా, ఊళ్లోవాళ్ళ అప్పులన్నీ తీర్చేశాడు. ఎదురింటి భాగ్యవంతుడికి పటం యిచ్చేటప్పుడు అద్దాన్ని తీసేసి యిచ్చాడు.

అది చూసి భాగ్యవంతుడు తెల్లబోయి, "అద్దంతో తిరిగిస్తే, నీ సంపద తరిగి పోతుందా? నువ్వింత కక్కుర్తి మనిషి వనుకోలేదు!" అన్నాడు.

నీలయ్య వినయంగా, "అయ్యా, మీ డబ్బుతో మీరు, లక్ష్మీదేవి పటానికి అద్దం వేయించుకుని పూజ చేస్తేనే ఫలిత ముంటుంది. మీరు పూజ ప్రారంభించే ముందు, నాకు చెబితే మహిమగల బూడిద యిస్తాను," అన్నాడు.

భాగ్యవంతుడు కోపంగా, "అవసరం లేనివాళ్ళు పూజచేస్తే, ఉన్నదంతా పోయి బూడిద అవుతుందని, నీకు తెలుసు. నా ఆస్తంతా బూడిద అయిపోవాలనా, నీ కోరిక? ఇదేనా, పటం యిచ్చిన నాపట్ల, నీ కృతజ్ఞత?" అని అడిగాడు.

అందుకు నీలయ్య, "అయ్యా, పటానికి అద్దం పోతే, ఏడాదిపాటు వేయించలేదు. నేను పటం అప్పుగా అడిగితే, అద్దం వేయించి అయినా యివ్వలేదు. కాబట్టి, మీరు పేదరికంలో వున్నట్టే, నాకు తోస్తున్నది." అన్నాడు.

భాగ్యవంతుడికి తల తీసేసినట్టయింది. తన కారణంగా నీలయ్య, ఒక్క వరహా కోసం ఎంత కష్టపడ్డాడో, ఆయన విని వున్నాడు.

ఈ అనుభవంతో భాగ్యవంతుడు, ఆ తర్వాతయితరులకుసాయపడేటప్పుడు— తన సాయం వారికి వెంటనే ప్రయోజన కరంగా వుండేటట్టు చూడసాగాడు.

అవసరంలో వున్నవాణ్ణి, సాటిమనిషి ఒక్క వరహా కోసం ఎంత కష్టపెడతాడో, స్వానుభవంతో తెలుసుకున్న నీలయ్య, తనకున్నంతలో ప్రతి ఒక్కరికీ సాయ పడుతూ, కలకాలం సుఖంగా జీవించాడు.





# దొంగసహాయం

కాశ్మీరుదేశంలో ఒక కులీనుడైన పండితుడు ఉండేవాడు. వారిది జమీందారీ వంశం. అయితే పండితుడి పూర్వీకులు విచ్చలవిడిగా డబ్బు ఖర్చు చేసి, అంతులేని ఆస్తి నాశనం చేసేశారు. ఆ కారణం చేత పండితుడు చాలా సామాన్యస్థితికి దిగజారిపోయాడు. ఐతే ఈ సంగతి లోకానికి తెలియకుండా ఆయనగుంభనగా సంసారం వెళ్ళబుచ్చుతూ వస్తున్నాడు.

ఈ పండితుడికి చక్కదనాల కుమార్తె ఉన్నది. ఆమెను చేసుకుంటామని ఎందరో యువకులు ముందుకువస్తున్నారు. కాని పండితుడు తన కుమార్తె పెళ్లి చేసే స్థితిలో లేడు. ఈ సంగతి కూడా ఎవరికి తెలియదు. పండితుడు నివసించే లోగిలి అడుగున మాళిగలలో చాలా నిధినిక్షేపాలు మూలుగుతున్నాయనే అందరూ అనుకునేవారు.

ఈ భ్రమ మూలంగానే పండితుడికి సుందరుడు అనే వాడితో వైరం కూడా వచ్చింది. ఇద్దరూ మొదట స్నేహితులే. ఒకసారి సుందరుడు పండితుణ్ణి చాలా పెద్ద మొత్తం అప్పు అడిగాడు. తన పేద స్థితిని పండితుడు లౌక్యంగా బయట పెట్టుకున్నాడు. కాని సుందరుడు తనకు అవమానం జరిగిందనుకుని పండితుడిపై కక్షపట్టాడు.

పండితుడిపై పగ తీర్చుకోవాలన్న ఉద్దేశంతో సుందరుడు ఒక గజదొంగను పట్టుకుని, పండితుడి సొత్తంతా కాజెయ్యమని వాణ్ణి అడిగాడు. గజదొంగ అందుకు సంతోషంగా ఒప్పుకున్నాడు.

ఒక రాత్రి పండితుడు పడుకుని నిద్రపోబోతుండగా ఆయన భార్య, "ఏమండీ, అమ్మాయికి ఎన్నో సంబంధాలు వస్తున్నాయి గదా. మనకు తగిన సంబంధం

కాశ్మీరు జానపద కథ

చూసి త్వరలో పెళ్ళి చెయ్యక, ఎందుకు తాత్సారం చేస్తున్నారు ?'' అని అడిగింది. తాము ఆర్థికంగా చితికిపోయిన సంగతి ఆమెకు కూడా తెలియదు.

''నువ్వన్నది నిజమే. కాని, అసలు సంగతి ఏమంటే, నా దగ్గిర డబ్బు లేదు. కొంతకాలంగా నేను ప్రతిష్ఠకోసం పాకులాడుతూ మనకున్న తాహతును మించి ఖర్చు చేస్తూ వస్తున్నాను. ఇప్పుడున్న పరిస్థితి ఏమంటే, మన సంసారం జరగటానికి ఎక్కడినుంచి డబ్బు తేవాలో నాకే తెలియదు. పిల్ల పెళ్ళి ఏంపెట్టి చెయ్యను?'' అని పండితుడు తన భార్యతో అన్నాడు.

''అయ్యో, ఎంత పాపిష్టిగతి దాపరించింది మనకు! ఇంతకాలం బతికి మనం దారిద్ర్యం వాతపడ్డామా?'' అని పండితుడి భార్య శోకించింది. పండితుడికి కూడా దుఃఖం ఆగలేదు.

భార్యా భర్తల సంభాషణ అంతా గజదొంగ విన్నాడు. పండితుడి ఇల్లు దోచే ఉద్దేశంతో వాడు ఆ రాత్రే దొంగతనంగా లోపల చొరపడ్డాడు. తనకు అబద్ధాలు చెప్పి సుందరుడు పంపాడని వాడికి చాలా కోపం వచ్చింది. పండితుడూ, ఆయన భార్యా నిద్రపోయిన దాకా వాడు పొంచి ఉండి, తరవాత చల్లగా బయటికి జారుకున్నాడు.

మర్నాడు ఉదయం సుందరుడు గజదొంగ కోసం చాలా సేపు చూశాడు. వాడు రాలేదు సరిగదా, సుందరుడి ఇంటిని ఎవరో కొల్లగొట్టినట్టు తెలిసింది. ఇంట్లో ఒక్క నగ మిగలకుండా ఎవరో అంతా ఊడ్చేశారు.

మర్నాడు నిద్ర లేస్తూనే పండితుడి భార్య తన తల దగ్గిర ఒక మూట ఉండటం చూసింది. విప్పి చూస్తే, ఆ మూట నిండా బంగారు నగలూ, వెండి నాణాలూ ఉన్నాయి. దానితోబాటు ఒక కాగితం ముక్క మీద, ''మీ కుమార్తె వివాహానికి గజదొంగ సమర్పించుకుంటున్న చిన్న కానుక,'' అని రాసి ఉన్నది.





# పెళ్ళికూతురు

ఒక మహా ధనికుడైన భూస్వామి ఉండే వాడు. ఆయనకు లంకంత ఇల్లుండేది; కట్టుకు పోయినంత బంగారమూ, వెండీ ఉండేవి; కనుచూపు మేరదాకా పొలా లుండేవి. కాని ఆయనకు ఒకటే లోటు— ఆయన భార్య చనిపోయింది.

ఒకనాడు పొరుగున ఉండే ఒక రైతు కూతురు భూస్వామి ఇంట పని చెయ్య టానికి వచ్చింది. ఆ పిల్ల భూస్వామికి చాలా నచ్చింది.

పేదయింటి పిల్ల గదా, తాను అడగ టమే వ్యవధిగా ఎగిరి, గంతేసి తనను చేసుకుంటుం దనుకున్నాడు.

అందుచేత ఆయన ఆ పిల్లతో తాను మళ్ళీ పెళ్ళాడదా మనుకుంటున్నట్టు చెప్పాడు.

''అలాగాండీ?'' అని పైకి అని ఆ పిల్ల తనలో, ''ఈ ముసలి నక్కకి పెళ్ళి ఒక్కటే తక్కువయింది గామాలు!'' అనుకున్నది.

''అవునే! నిన్నే చేసుకుందా మను కుంటున్నాను,'' అన్నాడు భూస్వామి.

''నేనా? నే నెందుకులెండి!'' అన్నదా పిల్ల తాపీగా.

తన మాటకు ఎదురు చెప్పిందని భూస్వామికి రోషం వచ్చింది.

కాని ఆయన ఎంత పట్టుదలగా అడిగితే ఆ పిల్ల అంత ఖచ్చితంగా ఆయ నను నిరాకరించింది.

పిల్లతో మాట్లాడి లాభం లేదనుకుని, భూస్వామి పిల్ల తండ్రి అయిన రైతును పిలిపించి, ''నన్ను పెళ్ళాడటానికి నీ కూతుర్ని ఒప్పిస్తివా, నాకు నీ విచ్చవల సిన బాకీ పూర్తిగా రద్దు చేయిస్తాను; నీ చేలో కలిసే పొలం కూడా ఇస్తాను,'' అన్నాడు.



రైతు కేమనాలో తోచక, "నాదేమీ అలస్యం లేదు. మీరు పెళ్లి ప్రయత్నాలు కానివ్వండి," అన్నాడు.

"పిల్ల ఒప్పుకున్నదా?" అని భూస్వామి అడిగాడు.

"అది ఒప్పుకునే దేమిటి? దాని ఇష్ట మేముంది? ముహూర్తాని కంతా ఏర్పాటు చేసి నాకు కబురు చెయ్యండి. మీ ఇంట పని ఉన్నదని దాన్ని పంపిస్తాను. మీరు చప్పున మూడు ముళ్ళూ వేసెయ్యండి," అన్నాడు రైతు.

ఈ ఉపాయం భూస్వామికి అద్భుతంగా నచ్చింది. ఆయన పెళ్ళి ఏర్పాట్లు చేయించాడు. పిలవవలసిన వారి నందరినీ ఆహ్వానించాడు. పురోహితుడు దగ్గిర నుంచీ అందరూ సిద్ధంగా ఉన్నారు. అప్పుడు భూస్వామి తన నౌకర్లలో ఒకణ్ణి పిలిచి, "ఒరే, మన పొరుగున ఉండే రైతు ఇంటికి వెళ్ళి, ఆయన ఏదో పంపిస్తా నన్నాడు, దాన్ని వెంట పెట్టుకు రా!" అన్నాడు.

నౌకరు కుర్రాడు రైతు ఇంటికిపోయి, "దండాలండి. తమరు మా దొరగారింటి కేదో పంపిస్తానన్నారట; వెంటనే తీసుకు రమ్మన్నారు," అన్నాడు.

"అదుగో, ఆ బీడులో ఉన్నది. వెంట పెట్టుకెళ్ళు," అన్నాడు రైతు.

"పసిపిల్ల, దాని కేమీ తెలీదులెండి. దాన్ని నేను ఒప్పిస్తాగా!" అని రైతు భూస్వామికి మాట యిచ్చి ఇంటికి వచ్చాడు. కాని, అతను నయానా, భయానా కూడా కూతురి చేత ఆ పెళ్ళికి సరే ననిపించలేకపోయాడు. ఆ భూస్వామి ఎత్తు ధనం ఇచ్చినా తన కాయన అక్కర్లే దని ఆ పిల్ల చెప్పేసింది.

రోజులు గడిచాయి. రైతు జవాబు కోసం ఆత్రంగా ఎదురుచూసే భూస్వామికి ఓర్పు సన్నగిల్లింది. ఆయన రైతును పిలిపించి, "పిల్లను ఒప్పిస్తానని మాట ఇచ్చావు. ఎంతకాలం ఎదురు చూడ మంటావు? వెంటనే తేల్చెయ్యి," అన్నాడు.

నౌకరు కుర్రాడు బీడుకు పరిగెత్తి వెళ్ళి, అక్కడ పచ్చిగడ్డి కోస్తున్న రైతు కూతుర్ని చూసి, "మా దొరగారింటికి మీ నాన్నగారేదో పంపిస్తానన్నారట. వెంట పెట్టుకు పోతాను," అన్నాడు.

ఆ పిల్ల, "ఓహో! ఇదా ఎత్తు?" అనుకుని, పైకి, "మీ నల్ల గుర్రపుపిల్ల గామాలు. అదుగో, ఆ కంచెకు అవతల కట్టి ఉన్నది. తీసుకుపో!" అన్నది.

నౌకరు కంచె మలుపు తిరిగివెళ్ళి, అక్కడ కట్టి ఉన్న నల్ల గుర్రపుపిల్లను విప్పి, దాని మీద ఎక్కి, దౌడు తీస్తూ భూస్వామి ఇంటికి తిరిగి వచ్చాడు.

వాణ్ణి చూడగానే భూస్వామి. "తెచ్చావురా?" అని అడిగాడు.

"తెచ్చానండి. వాకిలి దగ్గిర ఉన్నది." అన్నాడు నౌకరు.

"అయితే మరి మేడ మీదికి తీసుకు వెళ్ళు!" అన్నాడు భూస్వామి.

"మేడ మీది కాండి? అది నా ఒక్కడి వల్ల అవుతుందాండి?" అన్నాడు నౌకరు తెల్లబోయి.

పెళ్ళికూతురు మొరాయిస్తున్నదనీ, ఒకరికి ఇద్దరు ఉండటం మేలనీ అనుకుని భూస్వామి, "ఒరే, నీ ఒక్కడి వల్లా కాకపోతే ఎవరినన్నా తోడు తీసుకో. చెప్పిన పని కావాలి," అన్నాడు.

నౌకరూ, మరి కొందరూ కలిసి, గుర్రప్పిల్లను ముందు నుంచి లాగుతూ, వెనక నుంచి తోస్తూ, ఎలాగయితేనేం,



మెట్లెక్కించి మేడ మీది గదిలోకి చేర్చారు.

"పైకి చేరవేశానండి. చచ్చిచెడ్డంత పని అయిందండి," అన్నాడు నౌకరు కుర్రాడు తిరిగి వచ్చి.

"నీ శ్రమ ఉంచుకోనులేరా. నువు వెళ్ళి దాన్ని అలంకరించమని అక్కడ వున్న మన ఆడంగులతో చెప్పు," అన్నాడు యజమాని.

"అదేమిటి, దొరా!" అన్నాడు నౌకరు ఆశ్చర్యంతో.

"నువ్విప్పుడు మాట్లాడకంతే! దానికి చీరా అదీకట్టి, నగలూ అవీ పెట్టమను. దండా, తాళిబొట్టూ మరిచేరు!" అన్నాడు భూస్వామి.

నౌకరు వెళ్ళి దాసీ జనంతో, "ఇదుగో మీ రంతా వెళ్ళి గుర్రప్పిల్లని వెంటనే పెళ్ళికూతురిని చేయాలి. ఇది దొరగారి అజ్ఞ! చూడ వచ్చిన వాళ్ళ కందరికీ కడుపు చెక్కలై పోవాలిసిందే!" అన్నాడు.

దాసీలు వెళ్ళి గుర్రప్పిల్లకు చేయవలసినవన్నీ చేసి, పెళ్ళికూతుర్ని చేశారు. నౌకరు కుర్రవాడు కిందికి వెళ్ళి తన యజమానితో, "బాబుగారూ, అంతా సిద్ధం," అని చెప్పాడు.

"భేష్! అయితే చూస్తారేం, చప్పున దాన్ని, కిందికి తీసుకురండి," అన్నాడు భూస్వామి ఉత్సాహంగా.

మెట్ల మీద టకటకా పెద్ద చప్పుడయింది. గుర్రం మెట్లు దిగి పెళ్ళి చావడిలోకి వచ్చేసరికి అతిథులూ, ఆహూతులూ కిలకిలా నవ్వసాగారు. క్రమంగా ఆ నవ్వులే పెద్ద ఉప్పెన అయిపోయాయి.

భూస్వామి రెండో పెళ్ళి ప్రారంభం కాకముందే నవ్వులపాలయి పూర్తి అయిపోయింది.

పెళ్ళి చూడవచ్చిన వారంతా ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు.

పాపం, ఆ మానవుడు తిరిగి పెళ్ళి మాట స్మరిస్తే ఒట్టు!



## పిట్టకొంచెం – మేతఘనం!



రాబిన్ పిట్ట రోజుకు 14 అంగుళాల (4.26మీ.) పొడవుగల పురుగులను తింటుంది. పన్నెండు గంటల వ్యవధిలో తన శరీరం బరువుకన్నా 41 శాతం ఎక్కువ బరువు మేతను తింటుంది ఈ బుల్లి పిట్ట!

## ఎత్తయిన పర్వత శ్రేణులు



ప్రపంచంలోని ఇరవై ఎత్తయిన పర్వత శ్రేణులలో, పదమూడు పర్వత శ్రేణులు హిమాలయాలలోనూ, మిగతా ఏడు శ్రేణులు కారకోరం సమీప పర్వతాలలోనూ ఉన్నవి.

## ఎత్తులో ఎగిరే కాకులు—



ఎర్రకాళ్ళ కాకులు కొన్ని సముద్రమట్టానికి 8,200 మీ. (26,902 అడుగుల) ఎత్తులో నివసిస్తాయి. ఎవరెస్టు పర్వతారోహణకు వెళ్ళేవారిని అనుసరిస్తూ, ఈ కాకులు తరుచూ ఎగురుతూ వుంటాయి.

## స్పాంజ్



స్పాంజ్ అనబడే సముద్రపు పాచి నిజానికి ఒకనాటి వందలాది సూక్ష్మమైన సముద్ర ప్రాణుల సమూహమే. సముద్రం అడుగుభాగంలోనూ, బండలమీదా ఈ ప్రాణులు గుంపులుగుంపులుగా నివసిస్తాయి. వీటి పరిమాణం ఇంచుమించు 1 మి. మీ. నుంచి 1 మీ. వరకు ఉంటుంది!

## Statement about ownership of CHANDAMAMA (Telugu)
## Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956

| | |
|---|---|
| *1. Place of Publication* | 'CHANDAMAMA BUILDINGS'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *2. Periodicity of Publication* | MONTHLY<br>1st of each calendar month |
| *3. Printer's Name* | B.V. REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Prasad Process Private Limited<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *4. Publisher's Name* | B. VISWANATHA REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Chandamama Publications<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *5. Editor's Name* | B. NAGI REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | 'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *6. Name and Address of individuals who own the paper* | CHANDAMAMA PUBLICATIONS<br>PARTNERS:<br>1. B. VENKATRAMA REDDY<br>2. B.V. SANJAY REDDY<br>3. B.V. NARESH REDDY<br>4. B. PADMAVATHI<br>5. B. VASUNDHARA<br>6. B.V. SHARATH REDDY<br>7. B.N. RAJESH<br>8. B.L. ARCHANA (Minor)<br>9. B.L. ARADHANA (Minor)<br>(Minors admitted to the benefits of Partnership) |

**I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.**

*1st March 1988*

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1988 మే నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



Chaitanya Munshi

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మార్చి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నీళ్ళుకరువురా తమ్ముడూ! రెండవ ఫోటో: పాలుదొరుకులే అమ్మడూ!

పంపినవారు: నర్సిపురం చంద్రమౌళీశ్వరరావ్, శ్రీరాంనగర్—532 101 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

మధురమైన క్షణాన్ని అందుకోండి...




...పరిపూర్ణమైన క్రీమీ చాకొలెట్ ఎక్లెయిర్స్‌తో

Ask for
nutrin
Chocolate
Eclai

న్యూట్రీన

సహజమైనా మరి!

మరిన్ని పాలు మరింత వెన్న
మరింత చాకొలెట్!

